# చైనా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

# చౌ ఎన్ - లై నివేదిక



[చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభలో
కేంద్ర కమిటీ తరఫున
ద్వితీయ పంచవర్ష ప్రణాళికపై సమర్పింపబడిన
నివేదిక]




విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 2.

# చైనా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

# చౌ ఎన్ - లై నివేదిక

[చైనా కమ్యూనిస్టు పార్టీ 8 వ మహాసభలో
కేంద్ర కమిటీ తరపున ద్వితీయ పంచవర్ష
ప్రణాళికపై సమర్పింపబడిన నివేదిక]

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 2.

# విషయసూచిక

| విషయం | పేజీ |
|---|---|





# చైనా ద్వితీయ పంచవర్ష ప్రణాళికపై చౌ ఎన్ - లై నివేదిక

(1956 సెప్టెంబరు 3 వ వారంలో, చైనా కమ్యూనిస్టు పార్టీ 8 వ మహాసభకు చౌ ఎన్ - లై ద్వితీయ పంచవర్ష ప్రణాళికపై సమర్పించిన నివేదిక పూర్తిపాఠం)

కామ్రేడ్స్,

మన జాతీయ ఆర్థికాభివృద్ధికై ఉద్దేశింపబడ్డ మొదటి పంచవర్ష ప్రణాళిక సుమారు యింకొక సంవత్సరంలో జయప్రదంగా పూర్తికాబోతూంది. ప్రథమ ప్రణాళిక పూర్తికాగానే, ద్వితీయ ప్రణాళిక క్రింద మన నిర్మాణ కార్యక్రమాన్ని నిరాటంకంగా ప్రారంభించేందుకు, కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ముందుగానే ద్వితీయ ప్రణాళికను తయారుచేయడ మవసరమని భావించింది. దాన్నిగురించి కేంద్రకమిటీ కొన్ని సూచనలు చేసింది. వాటిని చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభ పరిశీలించవలసియుంది. వాటిని మహాసభ చర్చించి ఆమోదిస్తే, (మహాసభ ఆమోదించింది - అను.) స్టేట్ కౌన్సిల్‌కి (మంత్రి మండలి) అవి సమర్పింపబడతాయి. వాటిని స్టేట్ కౌన్సిల్ తిరిగి చర్చిస్తుంది.

రెండవ పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన మూల సూత్రాలు, విధానాలు కామ్రేడ్ లీ షావ్-చీ రాజకీయ నివేదికలో యిదివరకే వివరింపబడ్డాయి. ఇప్పుడు నేను కేంద్రకమిటీ ఆదేశానుసారం రెండవ పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన ప్రతిపాదనలను పార్టీ మహాసభ ముందుంచుతున్నాను.

# 1. మొదటి పంచవర్ష ప్రణాళిక అమలు జరిగిన విధానం

రెండవ పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన ప్రతిపాదనలను వివరించేముందు, మొదటి ప్రణాళిక ఏ పరిస్థితుల్లో ఏవిధంగా అమలు జరిగిందో తెలియజేస్తాను.

మొదటి పంచవర్ష ప్రణాళిక అమలుజరిగే కాలంలో మన దేశప్రజలు — ముఖ్యంగా కష్టజీవులంతా — సల్పిన కృషివల్ల సోషలిస్టు నిర్మాణంలోనేకాక సోషలిస్టు పరివర్తనలోకూడ మనం ఆశించినవాటికంటె గొప్ప విజయాలే శీఘ్రకాలంలో లభించాయి. మనం అద్భుతమైన విజయాలను సాధించాం. కాని కొన్నిలోపాలు, పొరపాట్లుకూడ జరిగాయి. వాటిని సరిదిద్దుకోడానికి మనం ప్రయత్నించాలి.

## పెట్టుబడి నిర్మాణాలు

1957 వ సంవత్సరం పూర్తి అయేనాటికి ప్రభుత్వం వివిధ పెట్టుబడి నిర్మాణాలపై మొదటి ప్రణాళికలో నిర్దేశించినదానికంటె 100 కి 10 వంతులు అదనంగా ధనం ఖర్చు చేయవలసి వస్తుందని ఊహింపబడుతోంది. మొదటి పంచవర్ష ప్రణాళిక తలపెట్టిన నిర్మాణ పథకాలన్నీ - కొన్ని మాత్రం తప్ప - నిర్ణీత కాలంలోనో, అంతకుముందో పూర్తి అవుతాయి. అంతేకాదు; ఈ ఐదేండ్ల కాలంలో ప్రారంభం కావలసిన కొత్త పథకాలెన్నో ప్రతియేడూ అదనంగాచేర్చబడుతూవచ్చాయి. 1957 వ సంవత్సరం పూర్తి అయేనాటికి 500 పారిశ్రామిక సంస్థలను కొత్తగా నిర్మించడమో, పాతవాటిని పునర్నిర్మించడమో జరుగుతుందని యిప్పుడు

మనం అంచనా వేస్తున్నాం. తత్ఫలితంగా మన పరిశ్రమల ఉత్పత్తి శక్తి పెరుగుతుంది; కొత్త పారిశ్రామిక శాఖలను నెలకొల్పడం సులభమవుతుంది; పాతశాఖలను కొంతవరకు పునర్నిర్మించడంకూడ సాధ్యమవుతుంది. ఈ విధంగా, పారిశ్రామికంగా చాల వెనుకబడి యున్న చైనా దేశ పరిస్థితి మారడం ప్రారంభమవుతుంది. మొదటి పంచవర్ష ప్రణాళిక క్రింద నిర్మింపబడే పారిశ్రామిక సంస్థలద్వారా ఈశాన్య భాగంలోని మన పారిశ్రామిక స్థావరం బాగా వృద్ధిచెందుతుంది; అన్షాన్‌లోని ఇనుము- ఉక్కు- పరిశ్రమ దానికి కేంద్రంగా ఉంటుంది. ఇన్నర్ మంగోలియా, వాయువ్య చైనా, ఉత్తర చైనాలలో కొత్తగా అనేక పారిశ్రామిక నగరాలు బయల్దేరుతాయి. ఈ 5 సంవత్సరాల కాలంలో కొత్తగా నిర్మింపబడ్డ, లేదా పునరుద్ధరింపబడ్డ రైల్వే మార్గాల పొడవు 5,500 కిలో మీటర్ల వరకు ఉంటుంది. చీనింగ్- ఎర్‌హలీన్, పావోచీ- చెంగ్‌టూ ల వంటి ముఖ్యమైన ట్రంక్ లైన్ల నిర్మాణం యిదివరకే పూర్తి అయింది. ఇంగ్‌టాన్- ఆమోయ్ రైలు మార్గం త్వరలో పూర్తి కాబోతూంది. లాంచౌ -సింకియాంగ్ మార్గం అప్పుడే పశ్చిమంగా యూమెన్ వరకు వేయడం పూర్తి అయింది. సికాంగ్-టిబెట్టు, చింఘై - టిబెట్టు వంటి ప్రధానమైన రోడ్లను కూడ నిర్మించడం పూర్తి అయింది. వాటిమీద రాకపోకలు, రవాణా ప్రారంభమైంది. ఈ రైల్వేలు, రోడ్లు పూర్తికావడంవల్ల మన దేశంయొక్క వాయువ్య దిశలోను, నైరుతి దిశలోనుగల విస్తృత ప్రాంతాలతో మిగతా ప్రాంతాలకు మరింత సన్నిహితమైన సంబంధాలేర్పడ్డాయి. నదీజలాలను నిల్వచేసే కార్యక్రమంలో భాగంగా, హువాయ్ నదిని శాశ్వతంగా అదుపులోకి తెచ్చేపని యిప్పుడు కొనసాగుతూంది; ఎల్లోనది మీద సన్‌మెన్ లోయవద్ద ఒక బ్రహ్మాండమైన హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు నెలకొల్పబడింది. ఇలాగే ఇంకా అనేక ఇరిగేషన్ ప్రాజెక్టులు, ఎన్నో మధ్యతరహా - చిన్నరకపు స్కీములు

నిర్మింపబడుతున్నాయి. ఇప్పటికే నిర్మాణం పూర్తి అయిన ప్రాజెక్టులు వరదలను నిరోధించడంలోను, సాగు భూములకు నీటిని సప్లయి చేయడంలోను ప్రముఖపాత్ర నిర్వహిస్తున్నాయి. గనుల త్రవ్వకంలో కూడ గత కొద్ది సంవత్సరాల్లో గొప్ప విజయాలు లభించాయి. మన పెట్టుబడి నిర్మాణాల అవసరాలను అవి తీర్చుతున్నాయి. పైన పేర్కొన్నట్లు, మొదటి పంచవర్ష ప్రణాళిక క్రింద అనేక మేజర్ ప్రాజెక్టుల నిర్మాణంలో పెట్టుబడి ఖర్చులు, పురోగతి ప్రణాళికలో నిర్దేశింపబడ్డ ప్రకారం జరుగుతున్నాయి. కాని, మన జాతీయ ఆర్థిక వ్యవస్థలో కొన్ని శాఖలు బహుశా తొలి పెట్టుబడి పథకాలను పూర్తి చేయలేక పోవచ్చు; కొన్ని మేజర్ ప్రాజెక్టుల నిర్మాణం మొదట అనుకున్న అంచనాలను చేరుకోలేక పోవచ్చు. ఈ నిర్మాణ శాఖలు, ప్రాజెక్టులు వచ్చే సంవత్సరకాలంలో సాధ్యమైనంతవరకు ప్రణాళికా లక్ష్యాలను చేరుకొనేందుకు మనం తీవ్రంగా కృషిచేయవలసియుంది. ఇలాగే, కొన్ని నిర్మాణ సంస్థలు శీఘ్రంగా పని పూర్తి చేయాలన్న విషయాన్ని మాత్రమే మనం దృష్టిలోవుంచుకొని, సరకుల నాణ్యాన్నీ, భద్రతా యేర్పాట్లనూ విస్మరించడంవల్ల నాసిరకం వస్తువులు తయారవడం, ప్రమాదా లెక్కువగా సంభవించడం, దుబారా ఖర్చులవడం జరుగుతోంది. వీటన్నిటినుంచి మనం గుణపాఠాలు నేర్చుకోవాలి.

## పారిశ్రామికోత్పత్తి

పారిశ్రామికోత్పత్తియొక్క మొత్తం విలువ (దీని క్రిందికి ఆధునిక పరిశ్రమల్లోను, చేతిపరిశ్రమల్లోను తయారైన సరుకుల విలువఅంతా వస్తుంది; 1952 లో స్థిరీకరింపబడ్డ ధరలనుబట్టి యీ విలువ లెక్కకట్టబడింది.) ప్రతి సంవత్సరం అంచనాలను మించి అధికంగా ఉంటోంది; మొత్తం ప్రణాళికకాలంలో చేరుకోవలసిన ఉత్పత్తి స్థాయి 1956 లోనే చేరుకోగల్గుతుంది. బహుశా 1957 వ

సంవత్సరం పూర్తిఅయేనాటికి మన పారిశ్రామికోత్పత్తి ప్రణాళికా లక్ష్యంకన్న 100కి 15 వంతులు అధికంగా ఉండవచ్చు. ప్రధాన పరిశ్రమల్లో అత్యధికభాగం లక్ష్యాలనుమించి ఉత్పత్తి చేస్తాయి. ఉదాహరణకు ఉక్కు ఉత్పత్తి 55 లక్షల టన్నులవరకు ఉంటుంది; విద్యుచ్ఛక్తి 1,800 కోట్ల కిలోవాట్ గంటలు; బొగ్గు 12 కోట్ల టన్నులు; లోహాలను కోతకోసే మెషీన్ టూల్స్ 30,000; 3 లక్షల 40 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసే విద్యుదుత్పాదక యంత్రాలు; కలప 2 కోట్ల 40 లక్షల క్యూబిక్ మీటర్లు; నూలు 56 లక్షల బేళ్ళు; ఫ్యాక్టరీ పంచదార 8 లక్షల టన్నులు; ఫ్యాక్టరీ కాగితం 8 లక్షల టన్నులు — ఉత్పత్తి జరుగుతుంది. కొన్ని ముఖ్యమైన కొత్త సరకులను మన మీరోజున ఉత్పత్తి చేయగల్గుతున్నాం. ఉదాహరణకు విద్యుదుత్పాదక యంత్రాలను, లోహాలను కరిగించే యంత్రాలను, గనులు త్రవ్వడంలో ఉపయోగించేవాటిని, లోహాలను కోత కోయడానికవసరమైన కొత్త పరికరాలను మన దేశంలోనే తయారు చేసుకొంటున్నాం. ఇదివరలో యివి మన దేశంలో ఎన్నడూ ఉత్పత్తి కాలేదు. అంతేకాదు; యిదివర కెన్నడూ మనం తయారుచేయజాలని మోటారుకార్లు, జెట్‌విమానాలుకూడా యిప్పుడు మన దేశంలోనే తయారవుతున్నాయి. ఇలాగే పెద్ద సైజులలో ఉక్కు సామగ్రి, హైగ్రేడ్ మిశ్రమ ఉక్కుకూడా మన దేశంలోనే తయారవుతూంది. కాని ముడి పదార్థాలు తగినన్ని లేనందున, మార్కెటు సంకుచితంగా ఉండడంవల్ల, తదితర సాంకేతిక కారణాలవల్ల అనేకరకాల సరుకులు లక్ష్యాలప్రకారం తయారు కాకపోవచ్చు. ఉదాహరణకు నూనె, వనస్పతి నూనెలు, గంధకం, సిగరెట్లు, అగ్గిపెట్టెలు యీ తరగతిక్రిందికి వస్తాయి.

## వ్యవసాయోత్పత్తి

1953-'54 సంవత్సరాల్లో సంభవించిన ప్రకృతి విపత్తుల వల్ల మన దేశంలో అనేకప్రాంతాలు తీవ్రమైన నష్టాలకు

లోనయాయి. తత్ఫలితంగా, ఆ రెండుసంవత్సరాల్లో వ్యవసాయో త్పత్తి ప్రణాళికా లక్ష్యాలను చేరుకోలేకపోయింది. అయినప్పటికీ, ఆహారధాన్యాలు 1952 లో కంటె ఎక్కువగా పండాయి. ఆయేడు (1952) ఆహారధాన్యాలు విస్తారంగానే పండాయి. 1955 లో తిరిగి మంచిపంటలు పండడంవల్ల అన్నిధాన్యాలూ కలిసి (సోయాచిక్కుళ్లు తప్ప) 34,960 కోట్ల కట్టీలు (1 కట్టీ=దాదాపు 1 పౌను)పండాయి. పత్తి 3,03,60,000 టన్నులు పండింది. ఇతర వ్యవసాయ దినుసుల ఉత్పత్తికూడా పెరిగింది. 1956 లో తిరిగి వరదలు, ముంపులు, తుపాన్లవల్ల, అనావృష్టివల్ల చాలప్రాంతాలు విస్తారమైన నష్టా నికి లోనయాయి. తత్ఫలితంగా కొన్ని పంటలు - ముఖ్యంగాపత్తి - దెబ్బతిన్నాయి. కాని మొత్తం గ్రామసీమలన్నీ సహకారోద్యమ వెల్లువలో పురోగమిస్తూండడంవల్ల ప్రకృతి విపత్తులకు లోనుకాని ప్రాంతాల్లో ఉత్పత్తి పెరుగుతుంది. దేశం మొత్తంమీద వ్యవ సాయోత్పత్తి 1957 లో చేరుకోవలసిన స్థాయిని 1956 లోనే చేరుకోగల్గుతుంది. వచ్చే సంవత్సర కాలంలో ప్రకృతి విపత్తులు మరీ ఎక్కువగా లేకపోతే, ప్రధానమైన ధాన్యాలు, కొన్ని పారి శ్రామిక పంటలు 1957 లో చేరుకోవలసిన ఉత్పత్తి లక్ష్యాలను అధిగమించవచ్చు. కాని సోయా చిక్కుళ్ళు, బటానీ గింజలు, రేప్‌గింజలు; జూట్, అంబరీ, కొన్ని పశుజాతులు బహుశా ప్రణాళికా లక్ష్యాలను చేరుకోలేకపోతాయి. ఈ బలహీనతలను అధిగమించడానికి మనం గట్టి చర్యలు తీసుకోవాలి.

## రవాణా, పోస్టల్ - టెలీ కమ్యూనికేషన్లు

వ్యవసాయోత్పత్తి, పారిశ్రామికోత్పత్తి, పెట్టుబడి నిర్మా ణాలు అభివృద్ధిచెందడంతోపాటు సరకుల రవాణా, పోస్టల్ - టెలీ కమ్యూనికేషన్ శాఖల పని ప్రతియేడు ఎక్కువవుతోంది. ప్రధాన మైన రవాణాశాఖ లన్నిటి ద్వారా పంపబడే సరకులు యిదివరకు కంటె యెక్కువ మైళ్లు ప్రయాణం చేస్తాయి; 1957 నాటికి యీ

శాఖలు ప్రణాళికా లక్ష్యాలను అధిగమిస్తాయి. కాని, కొన్ని రవాణా మార్గాలను, యంత్రాలను సాంకేతికంగా పునర్నిర్మించే కార్యక్రమం పూర్తి కానందున కొన్ని రవాణా మార్గాల్లోను, కేంద్రాల్లోను నేడు ఎక్కువ రేట్లు వసూలు చేయబడుతున్నాయి; రద్దీ ఎక్కువగా ఉంది. ఈ పరిస్థితిని చక్కబెట్టడానికి చర్యలు తీసుకోబడుతున్నాయి.

## వాణిజ్యం

సోషలిస్టు వాణిజ్యం అంతకంతకు అధికమవుతూండడంవల్ల దేశంలో క్రమబద్ధమైన, నిర్మాణయుతమైన మార్కెట్ యిదివరకే రూపొందింది; సోషలిస్టు వాణిజ్యంయొక్క నాయకత్వ స్థానం పటిష్ఠమవుతోంది. 1952 తో పోల్చితే 1956 లో దేశీయ మార్కెట్ యొక్క సరకుల ప్రమాణం 100 కి 66.3 చొప్పున పెరుగుతుంది. విదేశ వ్యాపారంలో ఎగుమతి దిగుమతుల విలువ 100 కి 65 చొప్పున పెరుగుతుంది. 1957 నాటికి చిల్లర వ్యాపారానికి సంబంధించిన అమ్మకాలు, దేశీయ వ్యాపారంలో అనేక సరకుల అమ్మకం, ఎగుమతి దిగుమతులు వాటివాటి లక్ష్యాలను చేరుకోగల్గుతాయి; కొన్నిటి విషయంలోలక్ష్యాలను అధిగమించడం కూడ జరుగుతుంది. గత కొద్ది సంవత్సరాల్లో, ఉత్పత్తి యొక్క పెరుగుదలనుబట్టి సరకుల మారకం కూడా పెరిగింది. జీవితావసర వస్తువులలో అతిముఖ్యమైన వాటి క్రయవిక్రయాలు క్రమబద్ధంగా జరగడంవల్ల ప్రజలకు ధారాళంగా వాడకం వస్తువులు సప్లయి అయాయి. ఇందువల్ల ధరల స్థిరీకరణ ప్రధానంగా విజయవంతమైంది. వ్యవసాయ – పారిశ్రామికోత్పత్తికి ప్రోత్సాహం లభించింది; ప్రజల జీవితం మెరుగైంది. ప్రస్తుతం వాణిజ్య రంగం యొక్క ప్రధాన లోపం ఏమంటే, సరకుల సప్లయి క్రమబద్ధంగా జరగడంలేదు; వ్యాపార నిర్వహణ అసంతృప్తికరంగా వుంది. అందువల్ల ఒక్కొక్కప్పుడు సరకులు నిల్వవుండిపోవడం, ఒక్కొక్కప్పుడు లోటుఏర్పడ్డం జరుగుతోంది.

## సంస్కృతి, విద్య, శాస్త్ర పరిశోధన, ప్రజారోగ్యం

ఈ రంగా లన్నిటిలోను గత కొద్ది సంవత్సరాల్లో గణనీయమైన అభివృద్ధి జరిగింది. 1957 నాటికి కొద్ది శాఖలు తప్ప మిగతావన్నీ ప్రణాళికయొక్క అంచనాలను అధిగమిస్తాయని చెప్పవచ్చు. ఉన్నతవిద్య, సెకండరీవిద్య, ప్రాథమికవిద్య, శాస్త్ర పరిశోధన, జర్నలిజం, గ్రంథ ప్రచురణ, బ్రాడ్ కాస్టింగ్, సాహిత్యం, కళలు, సినిమా, వ్యాయామశిక్షణ, వైద్యం—యీతరగతిక్రిందికే వస్తాయి. ఉదాహరణకు 1957 నాటికి ఉన్నత విద్యాలయాలలో విద్యార్థులసంఖ్య దాదాపు 4,70,000 వరకు ఉంటుంది; ఇది ప్రణాళికా లక్ష్యంకన్న 100 కి 9 వంతులు ఎక్కువ. పైనా శాస్త్ర పరిశోధనా సంస్థక్రింద 68 పరిశోధనాలయాలు నెలకొల్పబడతాయి. ఈ సంఖ్య ప్రణాళికలో పేర్కొన్న సంఖ్యకంటె 17 హెచ్చు.

## వ్యవసాయంలోను, చేతి పరిశ్రమల్లోను సహకారోద్యమం

1956 జూన్ నాటికి దేశమంతటా 9,92,000 వ్యవసాయ సహకారోత్పత్తి సంఘాలు నెలకొల్పబడ్డాయి. వాటిలో సభ్యులుగా చేరినవారు మొత్తం రైతుకుటుంబాల్లో 100 కి 91.7 వంతులున్నారు. ఉన్నత స్థాయికి చెందిన సంఘాల్లో చేరినవారు మొత్తం రైతు కుటుంబాల్లో 100 కి 62.6 వంతులున్నారు. ఇలాగే, చేతి పరిశ్రమలమీద ఆధారపడే జనాభాలో దాదాపు 100 కి 90 వంతులు సహకార సంస్థల్లో సభ్యులుగా చేరారు. 1957వ సంవత్సరాంతానికి కొద్దిపాటి సరిహద్దు ప్రాంతాల్లో తప్ప దేశమంతటా వ్యవసాయ సహకార సంస్థలు, చేతి పరిశ్రమల్లో పనిచేసే వారి సహకార సంస్థలు దాదాపు పూర్తిగా విస్తరిస్తాయని అంచనా వేయవచ్చు.

## ప్రైవేట్ పరిశ్రమల్లోను, వ్యాపారంలోను సోషలిస్టు పరివర్తన

1956 జూన్ మాసాంతానికి పెట్టుబడిదారీ పారిశ్రామిక సంస్థల ఉత్పత్తిని బట్టి 100 కి 99 వంతులు, కార్మికుల- ఉద్యోగుల

సంఖ్యనుబట్టి 100 కి 98 వంతులు ప్రభుత్వ- ప్రైవేట్ సంయుక్త నిర్వహణక్రిందికి వచ్చాయి. సొంతవ్యాపారం చేసుకొనే సంస్థల్లో షాపుల సంఖ్యనుబట్టి 100 కి 68 వంతులు, సిబ్బందినిబట్టి 100 కి 74 వంతులు ప్రభుత్వ- ప్రైవేట్ జాయింట్ షాపులుగానో, సహకార సంఘాలు లేక సహకార గ్రూపులుగానో మార్పు చెందాయి. ఒక్కొ-క్క- పారిశ్రామిక, వ్యాపారశాఖలో పెట్టుబడి దారీ పరిశ్రమలను, వ్యాపారాన్ని ప్రభుత్వ- ప్రైవేట్ సంస్థలుగా మార్చడంవల్ల, ఈ సంస్థల్లో వడ్డీరేటు ఒకేవిధంగా ఉండేటట్లు చేయడంవల్ల పెట్టుబడిదారీ ఉత్పత్తి సాధనాలను జాతిపరం చేయ డాని కవకాశ మేర్పడింది.

## ప్రజల భౌతిక స్థితిగతుల్లో అభివృద్ధి

ఇక్క-డ నేను ప్రజలభౌతిక స్థితిగతుల్లో వచ్చిన అభివృద్ధిని గురించి క్లుప్తంగా చెప్పదలచు కున్నాను.

మొత్తంమీద చూస్తే, గత కొద్ది సంవత్సరాల్లో కార్మి కుల, ఉద్యోగుల జీతాలు ప్రధానంగా పారిశ్రామికోత్పాదక శక్తికి అనుగుణ్యమైన నిష్పత్తిలోనే పెరిగాయి. కాని ఒకదశలో ఈ నిష్పత్తి శ్రామికోత్పాదక శక్తియొక్క నిష్పత్తికన్న చాలా వెనుకబడి యుంది. ఉదాహరణకు, 1955 లో వివిధ పరిశ్రమల శ్రామికో త్పాదకశక్తి (ప్రైవేటు పరిశ్రమలు మినహా) 1954 లో కన్న 100 కి 10 వంతులు పెరిగింది. కాని కార్మికుల, ఉద్యోగుల సగటు వేతనాలు 100 కి 0.6 వంతులు మాత్రమే పెరిగాయి. ఇతరశాఖల్లో కూడ యిలాంటి పరిస్థితే ఏర్పడింది. ఈ పొరపాటును మనం 1955 చివరిరోజుల్లో కనుగొన్నాం; వెంటనే దాన్ని సరిదిద్దడం ప్రారం భించాం. వేతనాల పద్ధతిని దేశవ్యాపితంగా సంస్కరించడం 1956 ఏప్రిల్ నుంచి మొదలుపెట్టాం. కార్మికులకు, ఉద్యోగులకు యిచ్చే సగటు జీతాలు 1955 లో కంటె 1956లో 100 కి దాదాపు 13 వంతులు ఎక్కువగా ఉండేటట్లు చేశాం. 1956 లో సగటు వేత

నాలు 1952 లో కంటె 100 కి 33.5 వంతులు ఎక్కువగాఉంటాయి; ఈ విధంగా మొదటి పంచవర్ష ప్రణాళిక నిర్దేశించిన 100 కి 33 వంతులకంటె ఎక్కువగా సగటు జీతాలు పెరుగుతాయి. శ్రామికోత్పాదక శక్తి కూడా మొదటి అంచనాల కంటె అధికంగా పెరుగుతుంది. ఉదాహరణకు, 1956 నాటికి ప్రభుత్వ పరిశ్రమల్లో శ్రామికోత్పాదకశక్తి 1952లో కంటె 100 కి 70.4 వంతులు ఎక్కువగా వుంటుంది. అనగా మొదటి పంచవర్ష ప్రణాళిక నిర్దేశించిన 100 కి 64 వంతులకన్న ఎక్కువగా వుంటుంంది.

గత కొద్దిసంవత్సరాల్లో మనం రైతుల శ్రేయస్సుదృష్ట్యా వ్యవసాయ పన్నులను స్థిరీకరించి, ప్రభుత్వం కొనే ధాన్యాల ధరలను ఉచితరీతిని పెంచాం. ఈ విధంగా, ఉత్పత్తి పెరుగుదలనుబట్టి రైతుల జీవనప్రమాణాన్ని క్రమంగా పెంచగలిగాం. 1954 లో మనం దేశం మొత్తంమీద వివిధ ధాన్యాల ఉత్పత్తి ఏ స్థితిలో ఉందో సమగ్రంగా తెలుసుకోనందున, కొనవలసిన ధాన్యాలకంటె కొంచెం ఎక్కువగా కొనడంవల్ల రైతుల్లో ఒకభాగం అసంతృప్తి చెందారు. కాని 1955 లో ఉత్పత్తినిబట్టి కోటాలను నిర్ణయించే పద్ధతిని ప్రవేశపెట్టి, క్రమబద్ధంగా ధాన్యాలను కొని అమ్మడంవల్ల రైతుల మానసికాందోళన తొలగిపోయింది; ఉత్సాహంతో వారు ఉత్పత్తిచేయడం ప్రారంభించారు. ఇప్పటి అంచనాలనుబట్టి మన రైతుల మొత్తం ఆదాయం యీ 5 సంవత్సరాల్లోను 100 కి 30 వంతులు పెరుగుతుంది.

## మొదటి ప్రణాళిక సాధించిన ముఖ్య విజయాలు

పైన వివరించినదాన్నిబట్టి, మన మొదటి పంచవర్ష ప్రణాళికయొక్క అంచనాలను జయప్రదంగా, ఖచ్చితంగా సాధించగలమని స్పష్టమవుతుంది. మనం తీవ్రంగా కృషిచేస్తే, మరీ ప్రమాదకరమైన ప్రకృతి విపత్తులుగాని, ఊహించడానికి వీల్లేని దుస్సంఘటనలుగాని సంభవించకపోతే, ప్రణాళికా లక్ష్యాలలో చాల వాటిని

అధిగమించగలం కూడా. మొదటి ప్రణాళికను మనం విజయవంతంగా అమలుజరపడంవల్ల, కొన్ని శాఖల్లో అధిగమించడంవల్ల మన జాతీయ ఆర్థికవ్యవస్థలో అపూర్వమైన మార్పులు వచ్చాయి. అవి యీ క్రింది పరిణామాల్లో వ్యక్తమవుతున్నాయి : వ్యవసాయ-పారిశ్రామికోత్పత్తి చాలాపెరిగింది. మొత్తం పారిశ్రామిక సరకుల, వ్యవసాయ దినుసుల విలువ (ఆధునిక పరిశ్రమలు, చేతిపరిశ్రమలు, వ్యవసాయంవల్ల ఉత్పత్తిఅయిన సరకులన్నిటి విలువ) 1952 లో కన్న 1957 లో 100 కి సుమారు 60 వంతులు పెరుగుతుంది; మొత్తం పారిశ్రామిక సరకుల, వ్యవసాయ దినుసుల విలువలో పారిశ్రామికోత్పత్తియొక్క (చేతిపరిశ్రమలతోసహా) నిష్పత్తి 100 కి దాదాపు 50 వంతులు ఉంటుంది; మొత్తం పారిశ్రామికోత్పత్తిలో ఉత్పత్తి సాధనాలను తయారుచేసే పరిశ్రమల ఉత్పత్తి 100 కి 40 కంటె ఎక్కువగా ఉంటుంది. అంటే, మన జాతీయ ఆర్థిక వ్యవస్థలో పరిశ్రమలు నిర్ణాయకపాత్రను నిర్వహిస్తాయి; సోషలిస్టు పరిణామంలో ఖచ్చితమైన విజయం లభించడంవల్ల అన్ని శాఖల్లోను—పరిశ్రమలు, వ్యవసాయం, రవాణా, వాణిజ్యం—పై చేయి ప్రభుత్వరంగానికే ఉంది. పైన పేర్కొన్న మార్పుల ఫలితంగా, మన జాతీయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన శాఖలన్నీ సంపన్నవంతమయాయి; విద్య, సంస్కృతి, శాస్త్రపరిశోధన వికసించే దశలో ప్రవేశించాయి. తత్ఫలితంగా ప్రజల జీవన ప్రమాణాన్ని నిరంతరం పెంచడానికి అనుకూలమైన పరిస్థితులేర్పడ్డాయి.

మన దేశంలో అన్ని జాతులకు చెందిన ప్రజలు, అన్ని ప్రజాతంత్రపార్టీలు, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన వున్న దేశభక్తులందరు ఐక్యతను ప్రదర్శిస్తూండడంవల్ల, సోషలిస్టు పరివర్తనలోను, సోషలిస్టు నిర్మాణంలోను వారు ఉత్సాహాన్నీ, చొరవనూ ప్రదర్శిస్తూండడంవల్ల – పైన పేర్కొన్న అఖండవిజయాలను మనం సాధించడానికి ప్రాతిపదిక ఏర్పడింది.

ఇంకొక విషయాన్నికూడా పేర్కొనవలసియుంది. మొదటి పంచవర్ష ప్రణాళికను అమలుజరపడంలో సోవియట్ మహాదేశం, నూతన ప్రజాతంత్రదేశాలు మనకు గొప్ప సహాయం చేశాయి. సోవియట్ యూనియన్ మనకు అనుకూలమైన షరతులమీద అప్పులిచ్చింది; 205 పారిశ్రామిక సంస్థల నిర్మాణానికి పథకాలు తయారుచేయడంలో సహాయపడింది; వాటికి కావలసిన యంత్రాలలో అధికభాగాన్ని సప్లైచేసింది; అనేకమంది ప్రముఖ నిపుణులను చైనాకు పంపింది; ఇంకా యెన్నోవిధాల సాంకేతికసహాయం చేసింది. నూతన ప్రజాతంత్ర దేశాలుకూడ మనకు యంత్రాలు, సాధన సామగ్రి, సాంకేతిక సిబ్బంది మొదలైనవాటిలో చాల సహాయం చేశాయి. చైనాలో యిప్పుడు పనిచేస్తున్న సోవియట్ నిపుణులు, నూతన ప్రజాతంత్రదేశాల నిపుణులు మన దేశాన్ని సోషలిస్టు దేశంగా నిర్మించే కృషిలో అపారమైన సహాయం చేస్తున్నారు. ఈ విధంగా సోవియట్ యూనియన్, నూతన ప్రజాతంత్రదేశాలు మన దేశానికి త్రికరణశుద్ధిగా, సోదరభావంతో చేస్తున్న సహాయానికి మనం హృదయపూర్వకంగా కృతజ్ఞత తెలియజేయవలసియుంది.

మొదటి పంచవర్ష ప్రణాళికను అమలుజరపడంలో మనం గణనీయమైన అనుభవాన్ని సంపాదించాం; కొన్ని గుణపాఠాలు కూడా నేర్చుకున్నాం. వాటితోడ్పాటుతో మనం యింకా చక్కగా సోషలిస్టు నిర్మాణంకొరకు పనిచేయగల్గుతాం. ఈ సందర్భంలో నేను గత కొద్దిసంవత్సరాల ఆర్థిక కార్యకలాపాలకు సంబంధించిన కొన్ని ముఖ్య సమస్యలపై నా అభిప్రాయాలను తెలియజేయదలచుకున్నాను.

## దీర్ఘకాల, స్వల్పకాల పథకాలను సమన్వయపరచే సమస్య

మొదటి విషయ మేమంటే, అవసరాలను అవకాశాలను దృష్టిలో ఉంచుకొని, మన జాతీయ ఆర్థిక వ్యవస్థ వాస్తవ పరి

స్థితుల కనుగుణ్యంగా అభివృద్ధిచెందేటందుకు ఆచరణయోగ్యమైన అభివృద్ధివేగాలను నిర్ణయించుకోవాలి; అన్ని శాఖలూ సమతూకంగా అభివృద్ధిచెందేటట్లు మొత్తం ప్రణాళికను పురోగామిపథంలో సవ్యమైన ప్రాతిపదికపై ముందుకు తీసుకెళ్ళాలి. మన మొక దీర్ఘకాల ప్రణాళికను తయారుచేసేటప్పుడు, దాన్ని అమలుజరపడంలో ఉత్పన్నమయే కొత్తపరిస్థితులను, కొత్తసమస్యలను ముందే పూర్తిగా తెలుసుకొనియుండడం సాధ్యంకాదు. అందుచేత, వాస్తవ పరిస్థితుల కనుగుణ్యమైనే దీర్ఘకాల లక్ష్యాలను ముందుంచుకొని, స్వల్పకాల పథకాలలో అవసరమైన సర్దుబాట్లు చేసుకొనడాని కవకాశం ఉంచుకోవాలి. మొదటి పంచవర్ష ప్రణాళికలో మనం సాధించదలచుకున్న లక్ష్యాలు ప్రధానంగా సరియైనవే. అలాగే, గత 4 సంవత్సరాలలో ప్రతి సంవత్సరం మనం సాధించదలచుకున్న లక్ష్యాలుకూడా ఆయా పరిస్థితుల కనుగుణ్యమైనవే. కనుకనే, మనం మొదటి ప్రణాళికయొక్క లక్ష్యాలను అధిగమించగలిగాం. కాని 1955, '56 సంవత్సరాలలో మనం తయారుచేసిన సాంవత్సరిక ప్రణాళికలకు సంబంధించినంతవరకు, కొన్ని శాఖల లక్ష్యాలను మరీ ఎక్కువగానో, మరీ తక్కువగానో తయారుచేశామని చెప్పవలసి యుంటుంది.

1955 సాంవత్సరిక ప్రణాళికను తయారుచేసేటప్పుడు, అంతకు ముందు రెండు సంవత్సరాలూ పంటలు పాడవడంవల్ల పెట్టుబడి నిర్మాణాల ప్రమాణాన్ని మరీ ఎక్కువగా తగ్గించివేశాం; ఆ యేడు ధనాన్ని పొదుపుగా వాడాలనే ఉద్యమంలో మనం వెంటనే ఉత్పత్తి చేయలేని కొన్ని పెట్టుబడి పథకాలకు ధనాన్ని అనుచితంగా తగ్గించివేశాం. పెట్టుబడి నిర్మాణాలకు సంబంధించిన ప్లానులను తరచు మార్చడంవల్లను, యీ విషయాన్ని మనం చాల ఆలస్యంగా ఆ యా శాఖలకు తెలియజేస్తూరావడం వల్లను ఆ ప్లానులు తగినంత సంతృప్తికరంగా అమలుజరగలేదు. తత్ఫలితంగా, ధనం ఎక్కువగా నిల్వ వుండిపోవడమేకాక, ఉక్కు కడ్డీలు-

సిమెంటు – కలప - మొదలైన గృహనిర్మాణ వస్తువులు కూడా అవసరాలకంటె ఎక్కువగా వున్నట్లు కనిపించింది. కొంతకాలం ముందుగా మనం వివిధ రిజర్వు ప్రాజెక్టులకు స్కీములు తయారు చేసుకొని, సకాలంలో నిర్మాణ ప్రమాణాన్ని ఎక్కువచేసే యున్న ట్లయితే, లేదా కొన్ని సరకులలో ప్రభుత్వ రిజర్వులను క్రమ బద్ధంగా పెంచుకొని యున్నట్లయితే, ముఖ్యమైన సాధనసామగ్రి తాత్కాలికంగా మేటలువేసేస్థితి లేకుండాపోయేది. కాని మనం భవిష్యత్పరిమాణాలను గురించి తక్కువ అంచనా వేయడంవల్లను, తాత్కాలిక నిల్వలు చాలకాలం వరకు ఉంటాయని భావించడం వల్లను తాత్కాలికంగా నిల్వవున్న ఉక్కు కడ్డీలను, సిమెంటును యితర ప్రాంతాలకు పంపివేసి, తద్వారా మన చిక్కులను పరిష్క రించుకోదలచాం. అట్టి చర్య అనుచితమని వేరే చెప్ప నవసరంలేదు.

ఇక 1956 సాంవత్సరిక ప్రణాళికను తయారుచేసేసమయంలో, అంతకుముందుసంవత్సరం పంటలు విస్తారంగా పండడంవల్లను, సోషలిస్టు పరివర్తనలో గొప్ప విజయాలు సంభవించడంవల్లను మన ఆర్థిక వ్యవస్థను అంతకుముందు సంవత్సరంకంటె ఎక్కువ త్వరి తంగా అభివృద్ధి చేయడానికి చర్యలు తీసుకోవడం అవసరమేకాక, సాధ్యంకూడా. కాని మనం పెట్టుబడి నిర్మాణాల ప్రమాణానికీ, సాధన సామగ్రిని సప్లైచేయగల శక్తికీ మధ్య సరియైన సమన్వయం కుదర్చలేక, పెట్టుబడి నిర్మాణాల ప్రమాణాన్ని మరీ ఎక్కువగా నిర్ణయించాం. అదేసమయంలో, మన ఆర్థిక వ్యవస్థకు చెందిన కొన్ని శాఖలు ఒకే సమయంలో అనేక పనులు చేసేధోరణిని, అతి తొందరగా విజయాలు సాధించాలనే ధోరణిని ప్రదర్శించాయి. తత్ఫలితంగా కొంతవరకు ధనాభావ మేర్పడ్డమేకాక, ఉక్కుకడ్డీలు– సిమెంటు– కలప వగైరా వస్తువులు చాల కొరవడ్డాయి; వాటిని భర్తీచేయడానికి ప్రభుత్వ రిజర్వులనుంచి మరీ ఎక్కువగా ఉపయో

గించుకోడం జరిగింది; మన జాతీయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వివిధ శాఖల్లో క్లిష్టపరిస్థితి ఏర్పడింది.

గత అనుభవంవల్ల మనకు బోధపడేదేమంటే, దీర్ఘకాల ప్రణాళికను తయారుచేసేటప్పుడు, సోషలిస్టు పారిశ్రామికీకరణ యొక్క ముఖ్యావసరాలనుబట్టీ, దేశంయొక్క భౌతిక - ద్రవ్య విషయిక అవకాశాలనుబట్టీ, మానవ సంపదనుబట్టీ వాస్తవ పరిస్థితుల కనుగుణ్యంగా లక్ష్యాలను నిర్ణయించుకోవాలి. అదే సమయంలో ప్రణాళికను సవ్యమైన ప్రాతిపదికపై ఉంచడానికి ఎల్లప్పుడూ కొంత రిజర్వును దగ్గర ఉంచుకోవాలి. ఇక సాంవత్సరిక ప్రణాళికలను తయారుచేసేటప్పుడు, ఒక్కొక్క సంవత్సరంలోనే కాక తర్వాత కాలంలోకూడా సంభవించగల కొత్త పరిణామాలను దృష్టిలో ఉంచుకొని, తదనుగుణ్యంగా మనకున్న అవకాశాలన్నిటినీ సద్వినియోగం చేసుకోవాలి. అలాచేస్తే దీర్ఘకాల ప్రణాళికను పూర్తిగా అమలుజరపడం, కొన్ని సందర్భాలలో అధిగమించడం సాధ్యపడుతుంది. మరో విషయంకూడా మనకు అనుభవం వల్ల బోధపడుతుంది. సాంవత్సరిక ప్రణాళికలను తయారుచేసేటప్పుడు మనం రెండు భిన్నధోరణులకు లోనుకాకుండా జాగ్రత్తపడాలి: పరిస్థితులు అనుకూలంగా ఉన్న సమయంలో ఇప్పుడూ, యికముందూ మన మెదుర్కోవలసిన వ్యతిరేక పరిస్థితులను సరిగా ఊహించి, తొందరపాటుగాను దుడుసుగాను వ్యవహరించకుండా జాగ్రత్తపడాలి. పరిస్థితులు వ్యతిరేకంగాఉన్న సమయంలో ఇప్పుడూ యికముందూ సంభవించగల అనుకూల పరిస్థితులనుకూడా సరిగా ఊహించి, పిరికితనంతోను అనుమానంతోను వ్యవహరించకుండా జాగ్రత్తపడాలి. అంటే, భౌతికపరిస్థితులన్నిటినీ సమగ్రంగా పరిశీలించి, ఈయేడూ, వచ్చేయేడూ సాధించవలసిన ప్రధాన లక్ష్యాలను సమగ్రమైన ప్రణాళిక రూపంలో పొందుపరచటానికి శాయశక్తులా ప్రయత్నించాలి. అలా చేస్తే, ప్రతి సాంవత్సరిక ప్రణాళిక

తరువాత వచ్చే ప్రణాళికలో కలిసిపోయి, క్రమబద్ధమైన స్థాయిలో పురోగమిస్తుంది.

## కీలకప్రాజెక్టులకు, మొత్తం ఏర్పాట్లకు మధ్య సమన్వయం

రెండవ విషయమేమంటే, మన జాతీయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వేర్వేరు శాఖలు క్రమబద్ధమైన నిష్పత్తినిబట్టి అభివృద్ధి చెందాలంటే, కీలకప్రాజెక్టులకూ మొత్తం ఏర్పాట్లకూ మధ్య సమన్వయ మేర్పరచాలి. గత కొద్ది సంవత్సరాల్లో మనం భారీపరిశ్రమలకు మొదటి ప్రాధాన్యత యిస్తూనే, వ్యవసాయోత్పత్తిని పెంచడానికి త్వరితంగా వ్యవసాయ సహకారసంఘాలను అభివృద్ధిచేసేమార్గం చేబట్టాం. అదేవిధంగా తేలిక పరిశ్రమలనుకూడ అభివృద్ధిచేసే విధానం అనుసరించాం. తత్ఫలితంగా, మన జాతీయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన అనేక ప్రధానశాఖలు అస్తవ్యస్తంగా తయారయే ప్రమాదాన్ని నివారించగలిగాం.

కాని, కీలక ప్రాజెక్టులకూ మొత్తం ఏర్పాట్లకూ మధ్య సరియైన సంబంధముండేటట్లు చేయడంలో మనం కొన్ని పొరపాట్లు చేశాం. ఉదాహరణకు 1953 లో కొన్ని ప్రాంతాల నిర్మాణ కార్యాల్లో స్థానికపరిస్థితులను దృష్టిలో ఉంచుకోకుండా, ప్రతీదీ వెంటనే దూకుడుగా చెయ్యాలనే ధోరణి ప్రవేశించింది. తత్ఫలితంగా ప్రభుత్వం మొదట నిర్మించదలచుకున్న ప్రాజెక్టుల కార్యక్రమం కొంత నష్టపడింది; ద్రవ్యం విషయంలో చిక్కులేర్పడ్డాయి; మానవసంపద, సాధనసామగ్రి వ్యర్థమయాయి. ఈ ధోరణి 1956 ప్రారంభంలో - అనగా 1956-67 సంవత్సరాల మధ్య సాధించవలసిన వ్యవసాయాభివృద్ధి ప్రణాళిక ప్రచురింపబడ్డ తర్వాత - మళ్ళీ తలయెత్తింది. కొన్ని శాఖలు, స్థానిక సంస్థలు త్వరగా విజయాలను సాధించాలనే ఉబలాటంతో 7 లేక 12 సంవత్సరాల్లో పూర్తిచేయవలసిన పనులను 3 లేక 5 సంవత్సరాల్లోనూ, 1 లేక 2 సంవత్సరాల్లోనూ పూర్తిచేయడానికి ప్రయ

త్నించాయి. ఈ ధోరణులను కేంద్రకమిటీ గుర్తించి సకాలంలో వాటిని సరిదిద్దింది.

ఈ దశలోనే, కొన్ని ముఖ్య కర్తవ్యాలకు మితిమీరిన ప్రాధాన్యత యిచ్చి, వాటితో దగ్గర సంబంధంగల యితర కర్తవ్యాల విషయమై అంతగా పట్టించుకోని మరొక ధోరణి తల యెత్తింది. ఉదాహరణకు, 1956 ప్రారంభంలో వ్యవసాయాన్ని అతిత్వరితంగా అభివృద్ధిచేసేందుకు మనం రెండు చక్రాల మర నాగళ్లు, చిన్నసైజు ఆవిరియంత్రాలు నిజంగా ఆ యేడు అవసరమైనవాటికంటె యెక్కువగా కావలసివస్తాయని ఊహించి, వాటిని మరీ యెక్కువగా ఉత్పత్తి చేసేందుకు ప్లానులు తయారు చేశాం. తర్వాత ఆ రెండిటి ఉత్పత్తిని తగ్గించేందుకుగాను పదేపదే ప్లానులను సవరించినప్పటికీ, వాటి ఉత్పత్తి లక్ష్యాలు యిప్పటికీ ఎక్కువగానే ఉన్నాయి. అందువల్ల ఉక్కును అధికంగా ఉపయోగించవలసివచ్చింది; 1956 లో ఉక్కు సప్లై క్లిష్టపరిస్థితిలో పడింది. ఇలాగే, కొన్ని యంత్ర నిర్మాణ సంస్థలచేత ఒకసారి ఉత్పత్తిని పెంచేటట్లు, మరొకసారి తగ్గించేటట్లు చేశాం. మరొక ఉదాహరణ తీసుకుందాం. మన నిర్మాణ కార్యక్రమాన్ని అమలుజరపడంలో కొన్ని పారిశ్రామిక సంస్థలు మరీ త్వరితంగా పురోగమించడంవల్ల, వాటికి కావలసిన ముడిపదార్థాలు తగినన్ని లేకుండా పోయాయి. ఫలితమేమయిందంటే, ఆ సంస్థలు తమ ఉత్పత్తి శక్తిని పూర్తిగా వినియోగించలేకపోయాయి. పారిశ్రామిక నిర్మాణాన్ని ప్రారంభించే దశలో యిలాంటి లోపాలు కొన్ని అనివార్యమే కావచ్చు. కాని యీ చిక్కులను ముందే గ్రహించి, వాటిని పరిష్కరించడానికి వివేకవంతమైన ఏర్పాట్లుచేయడం అసాధ్యమేమీకాదు.

గత కొద్ది సంవత్సరాల్లో మన నిర్మాణ కార్యాల విషయమై కేంద్రప్రభుత్వానికీ, రాష్ట్రప్రభుత్వాలకూ మధ్య, తీర ప్రాంతాలకూ దేశాంతర్గత ప్రాంతాలకూ మధ్య ఉండవలసిన సంబంధాల్లో మొత్తంమీద ఉచితమైన ఏర్పాట్లే చేశాం. కాని

మన పనిలో కొన్ని లోపాలున్నాయి. కొంతకాలం కేంద్రప్రభుత్వం యొక్క కార్యక్రమాలకే మనం ఎక్కువ ప్రాముఖ్యత యిచ్చాం; స్థానిక కార్యక్రమాలపట్ల తగినంత శ్రద్ధచూపలేదు. ఇలాగే, తీర ప్రాంతాల నిర్మాణ పథకాలకు తగినంత ప్రాముఖ్యత యివ్వకుండా, దేశాంతర్గత ప్రాంతాలకు అమితమైన శ్రద్ధచూపాం. ఇకమీదట మనం ఈ పాక్షికనైఖరిని తొలగించుకోడానికి పైన పేర్కొన్న సంబంధాలను ఎప్పటికప్పుడు సమన్వయపరచుకొంటూ ఉండాలి.

పై విషయాలనుబట్టి బోధపడేదేమంటే, కీలక ప్రాజెక్టులకు మనం ప్రాధాన్యత యివ్వవలసిందే; కాని వాటిని స్వతంత్రంగా, ఇతర యేర్పాట్లతో సంబంధంలేకుండా అభివృద్ధి చేయగలమనుకోడం పొరపాటు. అదేవిధంగా, సమగ్రమైన యేర్పాట్లు చేసుకోడం అవసరమే అయినప్పటికీ, కీలక ప్రాజెక్టులకు ప్రత్యేక ప్రాముఖ్యత యివ్వకుండా, అన్నిటికీ సమానప్రాముఖ్యత యివ్వడం పొరపాటు. మనం ప్లానులను తయారుచేసేటప్పుడు, కార్యక్రమం వేసుకొనేటప్పుడు కీలక ప్రాజెక్టులను మిగతా అన్ని యేర్పాట్లతో సమన్వయ పరచాలి.

## రిజర్వుల సమస్య

మూడవ విషయమేమంటే, రిజర్వులను నిర్మించుకొంటూ, వస్తుసామగ్రిని నిల్వచేసే పద్ధతిని మనం మెరుగుపరచాలి. మన ఆర్థిక వ్యవస్థ వృద్ధిచెందేకొద్దీ, ఒక శాఖకూ మరోశాఖకూ మధ్య సమతూకం తరచుచెడిపోతూ ఉంటుంది. అందుచేత మనం ఎప్పటికప్పుడు తగినంత వస్తుసామగ్రిని, ధనాన్ని, ఖనిజాలను, ఉత్పత్తి శక్తి వగైరాలను నిల్వచేసుకొంటూవుండాలి; ముఖ్యంగా ప్రభుత్వ నిల్వలను అధికం చేసుకోవాలి. ఇలా చేసినప్పుడే, మన జాతీయ ఆర్థికవ్యవస్థ క్రమబద్ధంగా పెంపొందుతుంది; సాంవత్సరిక ప్రణాళికలు నిరాటంకంగా అమలుజరుగుతాయి; ముందుగా ఊహించని చిక్కులేమైనా సంభవిస్తే వాటిని సులభంగా అధిగమించగల్గుతాం.

వచ్చే కొద్ది సంవత్సరాలలో మన వ్యవసాయోత్పత్తిపై ప్రకృతి విపత్తుల ప్రభావం చాల అధికంగానే ఉంటుంది. అందుచేత ఒకవేళ పంటలు దెబ్బతింటే తగినన్ని ధాన్యాలు, ప్రధానమైన పారిశ్రామిక ముడిసరుకులు నిల్వలో ఉండాలి. మన నిర్మాణం, ఉత్పత్తి నిత్యమూ పెరిగేకొద్దీ, రకరకాల వస్తుసామగ్రి ముడిపదార్థాలు నిల్వచేసుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. అంతేకాదు. ప్లానింగులో మనకింకా అనుభవం తక్కువే; మన పథకాలు తరచు అసమగ్రంగాను, అపసవ్యంగాను ఉంటున్నాయి. వాటిని తయారుచేసే సమయంలో అవి చాలవరకు సవ్యంగానే ఉన్నప్పటికీ, అనుకోని తలంపుగా సంభవించే కొన్ని ఘటనలవల్ల అవి తలక్రిందులు కావచ్చు. ఉదాహరణకు 1956 లో ఇనుము-ఉక్కు పరిశ్రమను అభివృద్ధిచేయడానికి కొత్త సాంకేతిక పద్ధతులను ప్రవేశపెట్టాం; ఓపెన్‌హార్త్ అండ్ బ్లాస్ట్ ఫర్నేసులను ఎక్కువగా ఉపయోగించడం మొదలుపెట్టాం. కాని వాటితో సమానంగా ముడియినుమును, కోక్‌ను సప్లైచేయలేకపోయాం. అందుచేత, ప్రణాళికలను అమలు జరిపేటప్పుడు సమతూకం చెడకుండా చూడాలంటే ఎప్పటికప్పుడు రిజర్వులను నిర్మించుకొంటూ ఉండడం తప్పనిసరి అవుతుంది.

గత కొద్ది సంవత్సరాల్లో ప్రభుత్వ రిజర్వులు ఎన్నో లేకపోయినప్పటికీ, మన ఉత్పత్తియొక్క, నిర్మాణంయొక్క అవసరాలను తీర్చడంలో అవి సహాయపడ్డాయి; 1956 లో వస్తుసామగ్రి కొరవడ్డంవల్ల యేర్పడిన క్లిష్టపరిస్థితిని తొలగించడానికవి ఉపయోగించాయి. కాని గతంలో మనం రిజర్వులయొక్క ప్రాముఖ్యతను పూర్తిగా గ్రహించలేదనే చెప్పాలి. పైన పేర్కొన్నట్లు, 1955లో కొన్ని వస్తువులు అదనంగా ఉన్నప్పుడు వాటిలో కొన్నిటిని తెలివితక్కువగా యితరప్రాంతాలకు పంపివేశాం. తత్ఫలితంగా 1956లో పెట్టుబడి నిర్మాణం విస్తరింపబడ్డప్పుడు ఆ వస్తువులకు తీవ్రమైన కొరత ఏర్పడింది.

మన దేశం ఆర్థికంగా వెనుకబడియుండడంవల్ల, జనసంఖ్య ఎక్కువగా ఉండడంవల్ల తరచు వస్తుసామగ్రికి కొరత ఏర్పడుతూనే ఉంటుంది. చాలకాలంవరకు ఈ స్థితి మనకు తప్పదు. అదనపు సరకులు తాత్కాలికంగా మాత్రమే వుంటాయి. అందుచేత మనం రిజర్వులను వృద్ధిచేసుకోడానికి, స్టోరేజిపద్ధతిని నెలకొల్పడానికి, ప్రభుత్వం ప్రధానమైన వస్తువులను—ముఖ్యంగా సప్లయి తక్కువగా ఉన్న వాటిని—నిల్వచేయడానికిఇంకాయెక్కువశ్రద్ధచూపాలి. ప్రభుత్వ సంస్థలుకూడా సరకులను నిల్వచేసే పద్ధతి ననుసరించాలి. ప్రభుత్వం నిల్వచేసినా, ప్రభుత్వసంస్థలు నిల్వచేసినా ఒక చక్కని ప్లానుప్రాకారం మాత్రం జరగాలి. ఏయే సరకులను ఎంతెంత నిల్వచేయాలో నిర్ణయించేటప్పుడు ఆచరణయోగ్యమైన పరిమితులను దృష్టిలో ఉంచుకోవాలి; క్రమక్రమంగా మాత్రమే ఆ నిల్వలను పెంచుకుంటూ వెళ్ళాలి. నిల్వలను ఒకేసారి ఎక్కువగా పెంచడానికి ప్రయత్నించకూడదు. ఎందుచేతంటే, ఇప్పటి ఉత్పత్తికి, నిర్మాణానికి అది హాని కలుగజేస్తుంది. అంతేకాక, గుడ్డిగా ఉత్పత్తి చేయడంవల్ల మేటలువేసిన సరకులను ప్రభుత్వ నిల్వలుగా పరిగణించే పొరబాటు ధోరణిఏర్పడుతుంది. దాన్ని మనం ఎదుర్కోవాలి. కారణమేమంటే, యిలా చేయడంవల్ల ప్రభుత్వధనం వృధాకావడమో, ఉపయోగంలో లేకపోవడమో జరుగుతుంది. ఇదికూడా మన ఉత్పత్తికీ, నిర్మాణానికీ హాని కలిగిస్తుంది.

## ఆర్థిక వ్యవస్థకూ ద్రవ్యనిధులకూగల సంబంధం

నాల్గవ విషయమేమంటే, ఆర్థిక వ్యవస్థకూ ద్రవ్యనిధులకూ సరియైన సంబంధముండేటట్లు చూడాలి. గత అనుభవం మనకొక విషయాన్ని తెలియజేసింది: ద్రవ్యరూపంలో మనకు వచ్చే ఆదాయం ఆర్థికాభివృద్ధిమీద ఆధారపడి వుండాలి; అలాగే, మనం చేసే ఖర్చులు ఆర్థికాభివృద్ధికి తోడ్పడాలి. ఇందుకు మనం మొదట ఆర్థికాభివృద్ధి కవసరమయే ప్రణాళికను గురించి, ముఖ్యంగా వ్యవ

సాయ-పారిశ్రామికోత్పత్తికి సంబంధించిన ప్రణాళికనుగురించి— ఆలోచించాలి. దానిపై ఆధారపడుతూ ఆ ప్రణాళికను జయప్రదంగా అమలుజరపడానికవసరమైన ద్రవ్యసేకరణ పథకాన్ని తయారు చేయాలి. ఆర్థికాభివృద్ధి ఎంతవరకు జరుగుతుందో తెలుసుకో కుండా ఆదాయ వనరులను పెంచడంగాని, ఆదాయాలను తక్కువ అంచనా వేయడంగాని, ఖర్చులను తగ్గిస్తూ సరుకులను మరీ ఎక్కువగా నిల్వచేయడంగాని పొరపాటు. ఇట్టి చర్యలవల్ల ఆర్థిక నిర్మాణం పూర్తిగా అభివృద్ధిచెందక కుంటుపడుతుంది.

ద్రవ్యసేకరణ పథకాన్ని తయారుచేసేటప్పుడు మనం ఆర్థికాభివృద్ధి ఎంతవరకు జరుగుతుందో, ఉత్పత్తికీ వినిమయానికీ ఎంత నిష్పత్తి ఉండాలో ముందుగా తెలుసుకోవాలి; మన కృషిలో చిక్కులేర్పడకుండా చూడ్డానికి మరీ పెద్ద అంచనాలు వేయకూడదు. ఇక ద్రవ్యాన్ని ఖర్చుచేసే పథకం తయారుచేసేటప్పుడు, కీలకప్రాజెక్టుల నిర్మాణానికవసరమయే ధనాన్నీ, తదనుగుణ్యంగా జరిగే ఆర్థికాభివృద్ధినీ దృష్టిలో వుంచుకొని, వివిధ శాఖలకు ధనాన్ని కేటాయించాలి. దీనితోపాటు నిర్మాణంయొక్క ప్రమాణానికీ, వస్తుసామగ్రియొక్క సప్లయికీ మధ్య సమతూకం ఉండేటట్లు చూస్తూ, అత్యవసర పరిస్థితులేర్పడినప్పుడు ఖర్చు చేయడానికెంత ధనం నిల్వచేసుకోవాలో అంచనా వేయాలి; మన కృషిలో ఎక్కువ చిక్కులేర్పడకుండా జాగ్రత్తవహించడానికి మరీ పెద్ద అంకెలను తయారుచేయకుండా చూచుకోవాలి. ఇలాగే, నిర్మాణావసరాలను మాత్రమే దృష్టిలో ఉంచుకోడం, ద్రవ్య సేకరణావకాశాలను విస్మరించడం, మనవద్ద తగినంత వస్తుసామగ్రి సాంకేతికనైపుణ్యం ఉందో లేదో తెలుసుకొనకుండా మరీ యెక్కువ ధనం అవసరమయే పథకాలను తయారుచేయడం—కూడా తప్పే.

కామ్రేడ్స్ తరచు "ద్రవ్యానికి పరిమితులు" ఉండాలా, అక్కర్లేదా అని చర్చించదలచుకుంటారు. ఆర్థికాభివృద్ధియొక్క

అవసరాలను విస్మరించి, స్వీయమానసిక దృక్పథంతో ఆర్థికాభివృద్ధిని ఆటంకపరిచే విధంగా అలాంటి పరిమితులు విధించడం ముమ్మాటికీ తప్పు. అట్టి పరిమితులను మనం వ్యతిరేకించాలి. కాని, ద్రవ్యసేకరణ పథకాలు ఆర్థికాభివృద్ధియొక్క నిజపరిస్థితుల కనుగుణ్యంగా ఉండి, ఉత్పత్తి—వినిమయాలమధ్య, మొదటి ప్రాధాన్యత యివ్వవలసిన కీలక ప్రాజెక్టులకూ—మొత్తం ఏర్పాట్లకూ మధ్య ఉండవలసిన సంబంధాన్ని సవ్యంగా ప్రతిబింబిస్తేమాత్రం ద్రవ్యసేకరణ పథకాలను ఖచ్చితంగా అమలు జరపాలి; వాటికి "ద్రవ్యపరిమితులు" అని ముద్రవేసి గుడ్డిగా ప్రతిఘటించడం తప్పు.

ఈ సందర్భంలో మరొక విషయంకూడా గుర్తించాలి. మన పనిలో జరిగే లోపాలను, పొరపాట్లను నాయకత్వంలోని స్వీయమానసిక, నిరంకుశధోరణులనుంచి వేరుచేసి చూడకూడదు. మన నాయకుల్లో కొంతమంది ఉన్నతపీఠా లలంకరించి, ప్రజలవద్దకు వెళ్ళకుండా, వాస్తవ పరిస్థితులు తెలుసుకోకుండా, వివిధ సమస్యలను పరిష్కరించడంలోను, ఎవిధ ఏర్పాట్లుచేయడంలోను స్వీయమానసిక ధోరణి నవలంబిస్తున్నారు. అందుచేత, వారి నిర్ణయాలు సరియైనవని భావించడానికి వీల్లేదు; నిజానికి వారు తప్పులుచేయడం సంభవం. అంతేకాక, పై స్థాయిల్లో నిరంకుశత్వం క్రిందిస్థాయిల్లో హుకూమతు తత్వాన్ని ప్రోత్సహిస్తుంది.

ఈ రోజున స్టేట్ కౌన్సిల్‌లో (మంత్రిమండలి) వివిధశాఖల సిబ్బంది మరీ ఎక్కువగా ఉంది; వాటి అంతస్తుల సంఖ్య మరీ అధికంగాఉంది. తత్ఫలితంగా క్రింది సంస్థలు అసంఖ్యాకమైన అధికార పత్రాలతోను, టెలిగ్రాములతోను, ఫారాలతోను నిండి వుంటున్నాయి. కొన్ని శాఖల్లో పనిచేసే నాయకులకు తమ శాఖల నుంచి ఏయే ఉత్తర్వులు పంపబడ్డాయో, ఏయే నిబంధనలు తయారుచేయబడ్డాయో తెలియదు. ఇట్టి నిరంకుశ పోకడలను మనం త్వరగా రూపుమాపాలి.

ప్రభుత్వ కార్యాల్లో బ్రహ్మాండమైన విజయాలు సాధింప బడినప్పటికీ, మనలో అహంభావంగాని, ఉపేక్షగాని ఏమాత్రం ఉన్నా వాటిని సహించకూడదు. మన జాతీయ ఆర్థికవ్యవస్థ అతి త్వరితంగా అభివృద్ధి చెందుతోందనీ, పరిస్థితుల్లో అనేకమార్పులు అతివేగంగా సంభవిస్తున్నాయనీ కూడ మనం గుర్తించాలి. కొత్త సమస్యలు ఎక్కడైనా, ఏ సమయంలోనైనా ఉత్పన్నం కావచ్చు. వాటిలో అనేకం ఒకదానితో ఒకటి సంబంధంకలిగియుండి, క్లిష్టంగా తయారు కావచ్చు. అందుచేత మనం ఎల్లప్పుడూ ప్రజలతో సన్నిహిత సంబంధం ఉంచుకొంటూ, వాస్తవపరిస్థితులను గమనిస్తూ ఉండాలి; మన పరిశీలనలు, అధ్యయనం మరింత పటిష్ఠంగా ఉండాలి; పరిస్థితుల్లో వచ్చేమార్పులను గమనిస్తూఉండాలి; వాస్తవపరిస్థితులపై నిర్దుష్టమైన పరిశీలనలు జరపాలి; అనుకూలపరిస్థితులను, అననుకూల పరిస్థితులనుకూడా తెలుసుకోవాలి; అవకాశాలను, చిక్కులనుకూడా సరిగా అంచనావేయాలి. ఇలా చేసినప్పుడే, మన జాతీయ ఆర్థిక వ్యవస్థలో అన్ని శాఖల కార్యకలాపాలను, అన్ని దృక్కోణాలను క్రమబద్ధమొనర్చడానికి సకాలంలో నిర్ణయాలు చేయగల్గుతాం. అప్పుడే సంఘర్షణలను, అవకతవకలను నివారించగలుగుతాం. ఎంతో విశాలమైన మన దేశంలో అనేక క్లిష్టపరిస్థితు లేర్పడుతున్నాయి. ఎన్నో తీవ్రమైన మార్పులు జరుగుతున్నాయి. ఇట్టి పరిస్థితుల్లో మనం ఏ విధమైన నిర్లక్ష్యాన్ని ప్రదర్శించినా, చాలపెద్దతప్పులు జరుగుతాయి; అపారమైన నష్టం వాటిల్లుతుంది. అందుచేత స్వీయమానసిక ధోరణిని, నిరంకుశత్వాన్ని రూపుమాపడం ప్రత్యేకప్రాముఖ్యతగల విషయం.

## 2. ద్వితీయ పంచవర్ష ప్రణాళికయొక్క ప్రధాన కర్తవ్యాలు

మన జాతీయ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధిచేయడాని కుద్దేశింపబడ్డ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను తయారు చేయడంలో, మొదటి పంచవర్ష ప్రణాళికవల్ల లభించిన విజయాలతో ప్రారంభించాలనీ, మూడవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయేనాటికి మనం సాధించదలచుకున్న లక్ష్యాలను దృష్టిలో ఉంచుకోవాలనీ, ఈ పరివర్తనదశలో ప్రభుత్వం నిర్వర్తించవలసిన ప్రధాన కర్తవ్యాన్ని జ్ఞాపక ముంచుకోవాలనీ, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో దేశంలోనూ బయటా ఉండే పరిస్థితులను సరిగా అంచనా వేయాలనీ — కేంద్రకమిటీ అభిప్రాయపడుతోంది. అలా జరిగినప్పుడే, మన ప్రణాళిక సమగ్రంగా ఉంటుందని భావిస్తోంది. ఇట్టి వైఖరి నవలంబించడం ద్వారానే, మన ప్రణాళిక అభ్యుదయ మార్గాన పురోగమించేటట్లు, సమగ్రంగాఉండేటట్లు చేయగల్గుతాం.

కేంద్రకమిటీ మన జాతీయ ఆర్థికాభివృద్ధికి తయారుచేసిన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యీ క్రింది ప్రధాన కర్తవ్యాలను సూచించింది.

1. భారీ పరిశ్రమలు ఆయువుపట్టుగా ఉండేటట్లు పారిశ్రామిక నిర్మాణాన్ని కొనసాగించడం; జాతీయ ఆర్థికవ్యవస్థను సాంకేతికంగా పునర్నిర్మించడం; సోషలిస్టు పారిశ్రామికీకరణకు బలమైన పునాదిని నిర్మించడం.

2. సోషలిస్టు పరిణామాన్ని కొనసాగించడం; సంయుక్త యాజమాన్య పద్ధతిని, మొత్తం ప్రజలందరి యాజమాన్య పద్ధతిని పటిష్ఠ మొనర్చి విస్తృత పరచడం.

3. పారిశ్రామికోత్పత్తిని, వ్యవసాయోత్పత్తిని, చేతి పరిశ్రమల ఉత్పత్తిని ఇంకా ఎక్కువగా పెంచడం; తదనుగుణ్యంగా సోషలిస్టు పరిణామాన్ని కొనసాగించే ప్రాతిపదికపైన, దాన్ని పూర్తిచేసే ప్రాతిపదికపైన రవాణా-వాణిజ్యాలను పెంపొందించడం.

4. వివిధ నిర్మాణాల్లోపాల్గొనే వారిని తరిఫీదు చేయడానికి తీవ్రప్రయత్నాలు చేయడం; సోషలిస్టు ఆర్థికవ్యవస్థ, సంస్కృతి అభివృద్ధి చెందడాని కవసరమైన శాస్త్రపరిశోధనలను పటుతర మొనర్చడం.

5. జాతీయ రక్షణను పటిష్ఠ మొనర్చడం; వ్యవసాయోత్పత్తిలోను, పారిశ్రామికోత్పత్తిలోను లభించిన పెరుగుదలను ఆధారంగా చేసుకొని, ప్రజల ఆర్థికస్థాయిని, సాంస్కృతిక స్థాయిని అభివృద్ధి చేయడం.

మన దేశాన్ని సోషలిస్టు పద్ధతులపై పారిశ్రామికవంత మొనర్చడంలో ముఖ్యోద్దేశం, దాదాపు మూడు పంచవర్ష ప్రణాళికల కాలంలో ప్రధానంగా ఒక సమగ్రమైన పారిశ్రామిక వ్యవస్థను నిర్మించడం. అట్టి పారిశ్రామిక వ్యవస్థ నానాటికి అభివృద్ధిచెందే ఉత్పత్తి విధానంయొక్క, సాంకేతిక పునర్నిర్మాణంయొక్క అవసరాలను ప్రధానంగా తీర్చడాని కవసరమయ్యే యంత్రాలను, సాధన సామగ్రిని, యితర వస్తువులను తయారు చేస్తుంది. అంతే కాదు. ప్రజల జీవన ప్రమాణాలు అంతకంతకు అభివృద్ధి చెందే కొద్దీ వారి అవసరాలుకూడా ఎక్కువవుతాయి; వాటిని తీర్చే టందుకు కావలసిన రకరకాల వాడకం వస్తువులనుకూడా అది ఉత్పత్తి చేస్తుంది.

ఈ సందర్భంలో కొందరిలా ప్రశ్నించవచ్చు: సోవియట్ యూనియన్ నాయకత్వం క్రింద వివిధ సోషలిస్టుదేశాల ఆర్థిక వ్యవస్థలు నిరంతరం అభివృద్ధిచెందుతూ ఉంటాయి గనుక, అవి ఆర్థికంగాను, సాంకేతికంగాను అన్యోన్యంగా సహకరించుకొనే అవకాశాలెక్కువగా ఉంటాయి గనుక, మన దేశం యింకా ఒక సమగ్రమైన పారిశ్రామిక వ్యవస్థను నెలకొల్పుకోవడం అవసరమేనా? నేడు మన దేశంయొక్క పరిస్థితికీ, సోవియట్ యూనియన్ స్థాపింపబడ్డనాటి పరిస్థితికీ ఎంతో వ్యత్యాసమున్నమాట నిజమే; ఆ రోజుల్లో సోవియట్ యూనియన్ ఆర్థికంగా యితర దేశాలనుండి వేరుచేయబడి ఏకాకిగా ఉండేది. అలాంటి పరిస్థితి నేడు చైనాలో లేదు. సోవియట్ యూనియన్‌యొక్క, నూతన ప్రజాతంత్ర దేశాలయొక్క అభివృద్ధి మన సోషలిస్టు నిర్మాణానికి చాల అనుకూలమైన పరిస్థితులను కల్పించింది. అయినప్పటికీ, ఎంతో పెద్ద జనాభాగల మన దేశం, సహజసంపద విస్తారంగాఉన్న మన దేశం, ఎన్నో అవసరాలను తీర్చవలసిన మన దేశం సొంతంగా సర్వసమగ్రమైన పారిశ్రామిక వ్యవస్థను నిర్మించుకోవలసిన అవసరమెంతైనా ఉంది. ఎందుచేతంటే, దేశావసరాల దృష్ట్యా చిరకాలంనుంచీ వెనుకబడియున్న మన జాతీయ ఆర్థిక వ్యవస్థను త్వరితంగా మార్చవలసియుంది; ప్రపంచావసరాల దృష్ట్యా మన దేశంలో బలీయమైన పరిశ్రమలు స్థాపింపబడితే, సోషలిస్టు దేశాలన్నిటిలోను బ్రహ్మాండమైన ఆర్థిక వెల్లువ రావడానికది తోడ్పడుతుంది; ప్రపంచశాంతిని రక్షించేందుకు పాటుపడుతున్న శక్తులకు అది బలం చేకూర్చుతుంది. అందుచేత, మనం సొంతంగా ఒక సమగ్రమైన పారిశ్రామిక వ్యవస్థను నిర్మించుకోనవసరం లేదనుకోడం, అంతర్జాతీయ సహాయంమీదనే పూర్తిగా ఆధారపడవచ్చుననుకోడం పొరపాటు; ఇది కేవలం పరాన్నభుక్కుల దృక్పథం.

ఇదేవిధంగా మనం, మన తలుపులను బిగించుకొని, సొంతంగా మనమే సోషలిస్టు నిర్మాణాన్ని కొనసాగించుకోగల మనుకోవడం

కూడా పొరపాటే. మన దేశంలో సమగ్రమైన పారిశ్రామిక వ్యవస్థను నిర్మించుకోవాలంటే సోవియట్ యూనియన్ యొక్క, నూతన ప్రజాతంత్ర దేశాలయొక్క సహాయం చాల కాలంవరకు అవసరమనడంలో ఎట్టి సందేహం లేదు. కాని అదే సమయంలో మనం యితర దేశాలతో కూడ ఆర్థిక, సాంకేతిక, సాంస్కృతిక సంబంధాలను అభివృద్ధిచేసుకోడం, విస్తృతపరచుకోడంకూడా అవసరం. సోషలిస్టు పారిశ్రామిక వ్యవస్థను నిర్మించుకున్న తర్వాతకూడా మనం యితర దేశాల సహాయాన్ని కోరవలసియుంటుంది. కేవలం తలుపులు బిగించుకొని కూర్చోడం, ఎవరినీ ఏమీ అడక్కుండా ఉండడం ఊహించశక్యంకాని విషయం. వాస్తవ పరిస్థితులవల్ల మనకు బోధపడే విషయ మేమంటే, సోషలిస్టు దేశాల మధ్య ఆర్థిక, సాంకేతిక సహకారం నిరంతరం విస్తృతమవడమేకాక, శాంతి - ప్రజాస్వామ్యం - జాతీయ స్వాతంత్ర్యం కొరకు అనేక దేశాల ప్రజలు సాగించేపోరాటం దినదినాభివృద్ధి చెందేకొద్దీ అంతర్జాతీయ ఉద్రిక్తత తగ్గుముఖం పడుతోంది; మన దేశానికీ, ప్రపంచంలోని యితర దేశాలకూ మధ్య ఆర్థిక, సాంకేతిక, సాంస్కృతిక సంబంధాలు రోజురోజుకు తప్పనిసరిగా విస్తృతమవుతాయి. అందుచేత, కేవలం మన మొక్కరమే సోషలిస్టు నిర్మాణాన్ని కొనసాగించగలమనుకోడం పొరపాటు దృక్పథం.

సోషలిస్టు పారిశ్రామికీకరణకు బలమైన పునాదిని నిర్మించాలంటే, రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో మనం లోహ పరిశ్రమను విస్తృతపరిచే కార్యక్రమాన్ని కొనసాగించాలి; యంత్ర నిర్మాణ పరిశ్రమను యింకా త్వరితంగా నిర్మించేందుకు తీవ్రకృషి జరపాలి; విద్యుదుత్పాదక పరిశ్రమను, బొగ్గుగనుల పరిశ్రమను, గృహోపకరణాల పరిశ్రమను పటిష్ఠ మొనర్చాలి; మన పరిశ్రమల్లో వెనుకబడి యున్న వాటిని — నూనె పరిశ్రమ, రసాయనపరిశ్రమ, రేడియో పరికరాల పరిశ్రమ— బాగా అభివృద్ధి చేయాలి. అదే సమయంలో మన జాతీయ ఆర్థిక వ్యవస్థను సాంకేతికంగా పునర్ని

ర్మించడానికి పూనిక వహించాలి; ముఖ్యంగా పరిశ్రమలను సాంకేతికంగా పునర్నిర్మించాలి.

గత అనుభవం నుంచి మనం తెలుసుకోవలసిన విషయమేమంటే, భారీపరిశ్రమలు ఆయువుపట్టుగా ఉండే పారిశ్రామిక నిర్మాణాన్ని యితరశాఖలతో వేరుచేసి అమలుజరపకూడదు. మన జాతీయ ఆర్థికవ్యవస్థలో భాగాలైన యితరశాఖలతో, ముఖ్యంగా వ్యవసాయంతో, దాన్ని సమన్వయపరచాలి. పరిశ్రమలు అభివృద్ధి చెందాలంటేను, మొత్తం జాతీయ ఆర్థికవ్యవస్థ అభివృద్ధి చెందాలంటేను వ్యవసాయం తప్పనిసరిగా అభివృద్ధి చెందాలి. వ్యవసాయాభివృద్ధిని ఆటంకపరిస్తే, తేలిక పరిశ్రమల అభివృద్ధికి అంతరాయమేర్పడ్డమే కాక, ప్రజల జీవనస్థాయి పెరగకపోవడమే కాక, భారీపరిశ్రమల అభివృద్ధి, మొత్తం ఆర్థికవ్యవస్థ యొక్క అభివృద్ధి కుంటువడుతుంది. అంతేకాదు. కార్మిక-కర్షక ఐక్యతకు కూడా నష్టం వాటిల్లుతుంది. అందుచేత మనం ద్వితీయ పంచవర్ష ప్రణాళికకాలంలో వ్యవసాయాన్ని బాగా అభివృద్ధి చేయాలి. అప్పుడు కాని వ్యవసాయాభివృద్ధినీ పారిశ్రామికాభివృద్ధినీ సమన్వయపరచజాలం. మన జాతీయ ఆర్థికవ్యవస్థలో భాగాలైన అన్ని శాఖలను క్రమబద్ధంగా సమన్వయపరచాలంటే, ఒకవైపు భారీపరిశ్రమలకూ తేలికపరిశ్రమలకూ మధ్య, పారిశ్రామికోత్పత్తికీ వ్యవసాయోత్పత్తికీ మధ్య సరియైన సంబంధాలుండేటట్లు చూడాలి; మరోవైపు రవాణాకూ సరకుల మారకానికీ మధ్య, ఆర్థికనిర్మాణానికీ సాంస్కృతికాభివృద్ధికీ మధ్య, జాతీయ నిర్మాణానికీ ప్రజల జీవనప్రమాణానికీ మధ్య సక్రమమైన సంబంధాలుండేటట్లు చూడాలి. అదేవిధంగా కేంద్ర ప్రభుత్వానికీ క్రింది ప్రభుత్వాలకూ మధ్య, తీరప్రాంతాలకూ దేశాంతర్గత ప్రాంతాలకూ మధ్య, వివిధ జాతులమధ్య సరియైన సంబంధాలను నెలకొల్పాలి. చైనాలో సోషలిస్టు సమాజాన్ని నిర్మించేందుకు అను

కూలమైన, ఉపయోగకరమైన అంశాలన్నిటినీ వినియోగించుకోవడమే వీటన్నిటి ఉద్దేశం.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మన పెట్టుబడి నిర్మాణం, వ్యవసాయ - పారిశ్రామికోత్పత్తి యిదివరకుకంటె చాల త్వరితంగా విస్తరించడాని కవకాశాలున్నాయి. ఈ 5 సంవత్సరాల కాలంలో ప్రభుత్వ ఆదాయం పెరుగుతుంది గనుక, దాని ఆధారంపై పెట్టుబడి నిర్మాణానికి ప్రభుత్వం యెక్కువ ధనం ఖర్చుపెట్టగల్గుతుందని కేంద్రకమిటీ అభిప్రాయపడుతోంది. మొదటి పంచవర్ష ప్రణాళికకాలంలో యిట్టి ప్రభుత్వ పెట్టుబడులు మొత్తం ఆదాయంలో 100 కి 35 వంతులు; దీన్ని రెండవ ప్రణాళిక కాలంలో 100 కి 40 వంతులకు పెంచవచ్చు. అప్పుడు మొదటి పంచవర్ష ప్రణాళికలోకన్న రెండవ ప్రణాళికలో ప్రభుత్వ పెట్టుబడులు రెట్టింపవుతాయి. పారిశ్రామిక, వ్యవసాయోత్పత్తివిషయమేమంటే, ప్రాథమిక అంచనాలనుబట్టి 1957 లో కన్న 1962 లో పారిశ్రామికోత్పత్తియొక్క మొత్తం విలువ దాదాపు రెట్టింపు అవుతుంది. ఇందులో ఉత్పత్తిసాధనాల, వాడకం వస్తువుల విలువ గణనీయంగా పెరుగుతుంది. కాని ఉత్పత్తి సాధనాలలో పెరుగుదల రేటు వాడకం వస్తువులలోకన్న అధికంగా ఉంటుంది. ఇక వ్యవసాయోత్పత్తియొక్క విలువ 100 కి 35 వంతులు పెరుగుతుంది. 1957 లో కంటె 1962 లో పారిశ్రామిక, వ్యవసాయోత్పత్తియొక్క మొత్తం విలువ 100 కి 75 వంతులు అధికంగా ఉంటుంది.

ఇక్కడ ఒక విషయాన్ని స్పష్టంచేయవలసియుంది. రెండవ పంచవర్ష ప్రణాళిక సూచనల్లో పేర్కొన్న పెరుగుదల శాతాలు మొదటి ప్రణాళికలో నిర్దేశించిన లక్ష్యాల ప్రాతిపదికపై తయారు చేయబడ్డాయి; ఈ లక్ష్యాలను అధిగమించడానికి గల అవకాశాలు పరిగణనలోకి తీసుకోబడలేదు. అందుచేత అవి ఎక్కువగా ఉన్నట్లు కనిపిస్తాయి. మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అయినతర్వాత,

1957 లో సాధింపబడు అంకెలను ప్రాతిపదికగా తీసుకొంటే, అప్పుడు యీ సూచనల్లో చూపబడిన పెరుగుదల శాతాలు తక్కువగా కనబడతాయి. ఉదాహరణకు, రెండవ ప్రణాళిక సూచనల్లో ఉన్న అంకెలనుబట్టి, 1962 లో చైనాదేశపు ఉక్కు ఉత్పత్తి 1,05,00,000 టన్నులనుండి 1,20,00,000 టన్నులవరకు ఉంటుంది. మొదటి ప్రణాళికలోఉన్న లక్ష్యాలనుబట్టి 1957 లో 41,20,000 టన్నుల ఉక్కు ఉత్పత్తి అవుతుంది. అంటే 1962 లో ఉక్కు ఉత్పత్తి 1957లో కన్న 100 కి 150 నుండి 190 వరకు పెరుగుతుంది. కాని, యిప్పటి అంచనాలనుబట్టి 1957 లో మొత్తం 55,00,000 టన్నుల ఉక్కు ఉత్పత్తి అవుతుంది. అప్పుడు పెరుగుదల 100 కి 100 నుండి 120 మాత్రమే ఉంటుంది.

పైన పేర్కొన్న విధంగా, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో పెట్టుబడినిర్మాణాన్ని, పారిశ్రామికోత్పత్తిని, వ్యవసాయోత్పత్తిని పెంచేటందుకు కేంద్రకమిటీ సరియైన సూచనలే చేసింది. అవి అభ్యుదయకరమైన, సమగ్రమైన ప్రాతిపదికపై తయారు చేయబడ్డాయి.

ప్రజలపై ఆధారపడుతూ, వారి చొరవనూ సృజనాత్మక శక్తినీ జయప్రదంగా పెంపొందించగలిగితే, మనకు అపారమైన శక్తి లభిస్తుంది; మన పురోగమనంలో అన్ని ఆటంకాలనూ అధిగమించగల్గుతాం; మొదటి పంచవర్ష ప్రణాళికవలెనే రెండవ ప్రణాళికను కూడా జయప్రదంగా అమలుజరపగల్గుతాం.

35



# 3. ద్వితీయ ప్రణాళికకు సంబంధించిన కొన్ని ప్రధాన సమస్యలు

పైన నేను ద్వితీయ పంచవర్ష ప్రణాళికయొక్క ప్రధాన కర్తవ్య మేమిటో తెలియజేశాను. ఈ ప్రణాళికకు సంబంధించిన సూత్రాలు, లక్ష్యాలు కేంద్రకమిటీయొక్క సూచనల్లో వివరింపబడ్డాయి. ఇక్కడ నేను ద్వితీయ ప్రణాళికకు సంబంధించిన కొన్ని ప్రధాన సమస్యలను గురించి క్లుప్తంగా మాట్లాడుతాను.

## 1. నిధుల సేకరణ, పంపకం

మన జాతీయ నిర్మాణంయొక్క స్థాయి మనం సేకరించ గలిగిన నిధులపైన, వాటిని పంచే విధానంపైన ఆధారపడి వుంటుంది. ఇప్పటికంటె మనం యెక్కువ నిధులను సేకరించి, వాటిని సరిగా పంచగలిగితే, ఉత్పత్తియొక్క పెరుగుదల రేటు హెచ్చి, జాతీయ ఆర్థిక వ్యవస్థయొక్క వివిధశాఖలు తదనుగుణ్యంగా వృద్ధిచెందుతాయి. అందుచేత నిధులను సేకరించే సమస్యను, వాటిని పంచే సమస్యను సక్రమంగా పరిష్కరించడం ఎంతో ప్రాముఖ్యతగల విషయం.

దేశంయొక్క కష్టజీవులందరూ కలిసి ఉత్పత్తిక్రమంలో కొత్తగా సృష్టించే భౌతిక సంపదకు జాతీయాదాయం అని పేరు. సోషలిస్టుదేశాల్లో జాతీయాదాయం అంతా కష్టజీవులదే. అందులో కొంతభాగాన్ని వారు తమ జీవితాన్ని నిలబెట్టుకొనేందుకు, దాన్ని చక్కబరచుకొనేందుకు ఉపయోగిస్తారు. మిగతా భాగాన్ని సామాజికోత్పత్తిని అధికంచేసేందుకు — అంటే కూడబెట్టేందుకు —

వినియోగిస్తారు. జాతీయాదాయాన్ని పంచడంలో వినియోగమయ్యే భాగానికీ కూడబెట్టే భాగానికీ మధ్య ఒక సవ్యమైన నిష్పత్తి ఉండే టట్లు చూడాలి. వినియోగభాగం మరీ తక్కువగా ఉంటే, ప్రజల జీవన ప్రమాణం కుంటుపడుతుంది; కూడబెట్టేభాగం మరీ తక్కువగా ఉంటే, నిర్మాణ కార్యక్రమం దెబ్బతిని, సామాజికోత్పత్తి వృద్ధిచెందకుండా ఉంటుంది. అందుచేత యీ రెండూ ప్రజలకు నష్టదాయకమైనవే.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మన జాతీయాదాయం మొదటి 5 సంవత్సరాలతో పోలిస్తే బహుశా 100 కి 50 వంతులు పెరగవచ్చు. మన ఆర్థికవ్యవస్థ ఇంకా వెనుకబడి యుండడంచేత, యితర శాఖలతో పోలిస్తే వ్యవసాయం అధిక భాగంగా ఉండడంచేత, మన ప్రజల జీవన ప్రమాణం యిప్పటికీ తక్కువగానే (మనకున్న అవకాశాలతో పోల్చిచూచుకొంటే) ఉండడంవల్ల, మన జాతీయాదాయంలో కూడబెట్టే భాగాన్ని మరీ ఎక్కువగాను, మరీ త్వరితంగాను పెంచకూడదు. కాని మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలోకంటె కొంచెం ఎక్కువగా మాత్రం ఉండవచ్చు. అంటే, రెండవ ప్రణాళిక కాలంలో జాతీయాదాయం యొక్క పెరుగుదలతోపాటు కూడబెట్టే భాగంకూడ గణనీయంగా పెరుగుతుంది.

నిధులను కూడబెట్టే సమస్య పరిష్కారమైన తర్వాత, వాటిని పంచే సమస్యను పరిష్కరించవలసి యుంటుంది. కేంద్ర కమిటీ ప్రస్తుత జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని, ప్రభుత్వ బడ్జెట్లో జాతీయ రక్షణకు, పరిపాలనా నిర్వహణకు కేటాయించే శాతాన్ని ఉచితరీతిని తగ్గించడం అవసరమనీ, సాధ్యమనీ భావించింది. అలాగే, ఆర్థిక – సాంస్కృతిక – విద్యా ప్రణాళికలకు ఎక్కువశాతం ఖర్చుచేయాలని అభిప్రాయపడింది. మొదటిపంచవర్ష ప్రణాళిక కాలంలో జాతీయ రక్షణకు, పరి

పాలనా నిర్వహణకు అయిన ఖర్చు మొత్తం ప్రభుత్వఖర్చులో 100 కి దాదాపు 32 వంతులుంది; రెండవప్రణాళిక కాలంలో దీన్ని దాదాపు 100 కి 20 వరకు తగ్గించడానికి ప్రయత్నించాలి. ఈ విధంగా ఆర్థిక, సాంస్కృతిక, విద్యా ప్రణాళికలకు ఖర్చుపెట్ట వలసిన శాతాన్ని 100 కి 56 నుంచి (మొదటి పంచవర్ష ప్రణాళిక) 100 కి దాదాపు 60-70 వరకు పెంచవచ్చు. అప్పుడు మన ఆర్థిక, సాంస్కృతిక, విద్యారంగాలు త్వరితంగా అభివృద్ధి చెందుతాయి.

ప్రభుత్వనిధులను పెట్టుబడి నిర్మాణానికి పంచేటప్పుడు పరిశ్రమలు, వ్యవసాయం బాగా అభివృద్ధిచెందేటట్లు చూడాలి. మొత్తం ప్రభుత్వ పెట్టుబడిలో పరిశ్రమలకు కేటాయించవలసిన భాగం మొదటి ప్రణాళికలో నిర్దేశించిన 100 కి 58.2 శాతాన్ని రెండవ ప్రణాళికకాలంలో 100 కి దాదాపు 60 శాతం వరకు పెంచ వచ్చు. అలాగే వ్యవసాయానికీ, నదీ జలాలను నిల్వచేసే పథకా లకూ, అటవీ సంపదకూ కేటాయించవలసిన భాగం 100 కి 7.6 నుంచి 10 వరకు పెంచవచ్చు. వీటన్నిటితోపాటు రవాణా, పోస్టల్ — టెలీ కమ్యూనికేషన్, విద్యాసాంస్కృతిక శాఖలు, శాస్త్రవిజ్ఞానశాఖ, ప్రజారోగ్యశాఖ, వాణిజ్యం, గృహనిర్మాణం మొదలైనవాటికి పెట్టుబడులను సక్రమంగా కేటాయించాలి. అలా చేసినప్పుడే ప్రతిశాఖ ఒక నిష్పత్తి ప్రకారం అభివృద్ధిచెందుతుంది.

పారిశ్రామిక పెట్టుబడులను పంచేటప్పుడు భారీ పరిశ్రమ లకూ తేలిక పరిశ్రమలకూ మధ్య సమన్వయముండేటట్లు కొన్ని యేర్పాట్లు చేయాలి. మన తేలిక పరిశ్రమల్లో యింకా గణనీయ మైన అవకాశాలుండడంవల్ల మొదటి పంచవర్షప్రణాళిక కాలంలో తేలిక పరిశ్రమలకు మొత్తం పారిశ్రామిక పెట్టుబడులలో 100 కి 11.2 వంతులు కేటాయింపబడింది (తర్వాత యిది కొద్దిగా హెచ్చింపబడింది). ఆ శాతం సరియైనదే. రెండవ ప్రణాళిక కాలంలో ప్రజల వినిమయం క్రమక్రమంగా హెచ్చుతుంది గను

కను, కొన్ని తేలిక పరిశ్రమల ఉత్పత్తి శక్తి చాలకపోవచ్చుగను కను తేలిక పరిశ్రమల్లో ప్రభుత్వ పెట్టుబడుల శాతాన్ని తగువిధంగా పెంచవలసియుంటుంది. అయితే, కొన్ని తేలిక పరిశ్రమలు తమ ఉత్పత్తి అవకాశాలను పూర్తిగా ఉపయోగించుకోలేదు; ముఖ్యంగా సంయుక్త యాజమాన్యం క్రిందవున్న అనేక పారిశ్రామిక సంస్థలు పునర్నిర్మింపబడ్డవెంటనే అవి ఇంకా యెక్కువగా ఉత్పత్తిచేయ గల్గుతాయి; సహకార సంస్థల ప్రాతిపదికపై నిర్మింపబడ్డ చేతిపరి శ్రమలు కూడా వాడకం వస్తువుల ఉత్పత్తిని ఎక్కువచేస్తాయి. అందుచేత వివిధ తేలిక పరిశ్రమలకు పెట్టుబడులను కేటాయించ డంలో యీ చిక్కులన్నిటినీ దృష్టిలో ఉంచుకోవాలి.

## 2. పెట్టుబడి నిర్మాణానికి ఏర్పాట్లు

పెట్టుబడి నిర్మాణానికవసరమైన నిధులను సక్రమంగా పంచ డంతోపాటు, పెట్టుబడి నిర్మాణానికి సంబంధించిన యీ క్రింది సమస్యలను కూడా మనం పరిశీలించాలి.

(అ) లోహపరిశ్రమను, యంత్రనిర్మాణ పరిశ్రమను పటిష్ఠ మొనర్చే సమస్య: భారీపరిశ్రమలు ఆయువుపట్టుగాగల మన పారిశ్రామిక నిర్మాణంలో యంత్రనిర్మాణ పరిశ్రమకు, లోహ పరిశ్రమకు ప్రత్యేక ప్రాముఖ్యత యివ్వాలి.

మన దేశంలో సమగ్రమైన పారిశ్రామిక వ్యవస్థను స్థాపించ డానికి యంత్రనిర్మాణ పరిశ్రమ ఒక ముఖ్యమైన లంకె. మొదటి పంచవర్ష ప్రణాళికకాలంలో మనం అనేక భారీయంత్రాలను, అతి సున్నిత యంత్రాలను, రకరకాల ఫ్యాక్టరీల కవసరమైన పూర్తి పరికరాలను తయారుచేసుకోలేకపోయాం. అందుచేత మన పరిశ్రమ లకు కావలసిన యంత్రాలు, సాధనసామగ్రి 100కి దాదాపు 40 వంతులు విదేశాలనుంచి దిగుమతిచేసుకోవలసివచ్చింది. అందుచేత, యిప్పటినుంచీ పారిశ్రామిక నిర్మాణంలో మనల నెదుర్కొనే క్లిష్టసమస్య యంత్రనిర్మాణ పరిశ్రమను ఎక్కువగా అభివృద్ధి

చేయడం. ముఖ్యంగా అనేక రకాల పెద్దసైజు యంత్రాలను, అతి సున్నిత యంత్రాల భాగాలను, యంత్రపరికరాలను ఉత్పత్తి చేయడానికి తీవ్రప్రయత్నాలు చేయడం అవసరం. రెండవ పంచవర్ష ప్రణాళిక నిర్దేశించిన ప్రకారం నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించడంలో మనం యంత్రాల, యంత్రపరికరాల ఉత్పత్తి యొక్క శాతాన్ని 100 కి దాదాపు 70 వంతులవరకు (దేశ అవసరాల్లో) పెంచడం చాల అవసరం.

భారీ పరిశ్రమలకు పునాది లోహ పరిశ్రమ. బలీయమైన లోహ పరిశ్రమ మనకు లేనిదే; యంత్రనిర్మాణ పరిశ్రమను నిర్మించడం కష్టం. మొదటి పంచవర్ష ప్రణాళికకాలంలో మన దేశావసరాలలో 100 కి 80 వంతులు మాత్రమే దేశీయ పరిశ్రమ సప్లయి చేయగలిగింది. ఉక్కు సామగ్రిలో కొన్ని ప్రత్యేకమైన రకాలు పూర్తిగానో, ఇంచుమించు పూర్తిగానో విదేశాలనుంచి దిగుమతి అయాయి. అందుచేత, మన పారిశ్రామిక నిర్మాణంలో యికమీదట లోహపరిశ్రమను బాగా అభివృద్ధి చేయడం ఒక క్లిష్ట సమస్యగా ఉంటుంది. రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో మనం అమలు జరిపే నిర్మాణ కార్యక్రమంద్వారా, వివిధ ప్రమాణాల్లో ఉత్పత్తి అయే రకరకాల ఉక్కు సామగ్రి, తదితర నాన్ ఫెరస్ లోహాలు మన ఆర్థిక వ్యవస్థకు చెందిన వివిధశాఖల అవసరాలను — ముఖ్యంగా యంత్రనిర్మాణ పరిశ్రమయొక్క అవసరాలను— ప్రధానంగా తీర్చగలిగేటట్లుండాలి.

భారీ పరిశ్రమలకు సంబంధించిన వివిధశాఖల్లో మనం యంత్రనిర్మాణ పరిశ్రమను, లోహపరిశ్రమను అభివృద్ధిచేయడంతోపాటు, అనేకబలహీనమైన లింకులను బలపరచుకోడం, ఎటూ తేలకుండా మిగిలివున్న అంశాలపై నిర్ణయాలు తీసుకోడం కూడా అవసరం. ఉదాహరణకు, మన దేశంలో అరుదుగా లభించే కొన్ని లోహాలను తవ్వి తీయవలసి యుంటుంది; కొన్ని లోహాలను మెరుగు పరచ

వలసి యుంటుంది; రసాయనిక ఎరువుల పరిశ్రమను విస్తృత పరచ వలసియుంటుంది; అణుశక్తిని శాంతికార్యాలకుఉపయోగించే పద్ధతు లను రూపొందించవలసియుంటుంది. వీటన్నిటినీ ప్రధాన స్కీము లలో చేర్చి వాటిపట్ల తగు శ్రద్ధ వహించాలి.

భారీ పరిశ్రమలను అభివృద్ధిచేయాలంటే, భూగర్భ పరి శోధనలపనిని యికముందుకూడా కొనసాగిస్తూ, విస్తృతపరచాలి; దేశవ్యాపిత పరిశోధనలనూ మొదటి ప్రాధాన్యత యివ్వవలసిన వాటినీ సమన్వయ పరచాలి; ఇంకా యెక్కువ గనులను, ఎక్కువ రకాల ముడి లోహాలను కనిపెట్టాలి; పారిశ్రామిక నిర్మాణంయొక్క దీర్ఘకాల అవసరాలను, తక్షణ అవసరాలను తీర్చేందుకు మన దేశంలో లభించే ఖనిజ నిధులను గురించి ఇంకా యెక్కువ సంఖ్యా వివరాలను సేకరించాలి.

(ఆ) ఉత్పత్తి సాధనాలను పంపకంచేసే సమస్య: మన దేశంయొక్క ఉత్పత్తి సాధనాలను వివేకవంతంగా పంచడానికి, అన్ని ప్రాంతాలను ఆర్థికంగా అభివృద్ధిచేయడానికి, భౌగోళికంగా అనేక ప్రాంతాల్లో విభజింపబడివున్న పరిశ్రమలను వనరుల పరి స్థితితోను జాతీయ రక్షణతోను సమన్వయపరచడానికి — దేశం యొక్క అంతర్భాగంలో క్రొత్త పారిశ్రామిక స్థావరాలను క్రమ బద్ధంగా నెలకొల్పాలి. ఈ విధానానికే మనం కట్టుబడివుండాలి. దేశంయొక్క అంతర్భాగంలో క్రొత్త పారిశ్రామిక సంస్థలను నెల కొల్పడంవల్ల అల్పసంఖ్యాకజాతుల ప్రాంతాల్లో ఆర్థిక, సాంస్కృ తికాభివృద్ధికూడా ప్రోత్సహింపబడుతుంది. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మధ్య చైనాలోను, ఇన్నర్ మంగోలియాలోను ఇనుము – ఉక్కుపరిశ్రమను కీలకంగాచేసుకొని వివిధ పారిశ్రామిక స్థావరాలను నెలకొల్పే కృషిని కొనసాగించవలసియుంది; నైఋతి చైనాలోను, ఆగ్నేయ చైనాలోను, సన్మెన్‌లోయ చుట్టుప్రక్కల ఉన్న ఇనుము – ఉక్కుపరిశ్రమను, పెద్దతరహా జలవిద్యుదుత్పాదక

కేంద్రాలను కీలకంగా చేసుకొని, కొత్త పారిశ్రామిక స్థావరాలను నిర్మించాలి; సింకియాంగ్‌లో నూనె పరిశ్రమను, నాన్‌ఫెరస్ లోహాల పరిశ్రమను కొనసాగించాలి. టిబెట్‌లో పారిశ్రామికాభి వృద్ధికి మార్గం సుగమమొనర్చడానికి భూగర్భ పరిశోధనలను తీవ్ర తర మొనర్చాలి.

అదేసమయంలో మనం తీరప్రాంతాల్లో యిప్పుడున్న పారి శ్రామిక స్థావరాలను కూడా పూర్తిగా వినియోగించుకోవాలి. దేశాంతర్గత ప్రాంతాల్లో పరిశ్రమలను నిర్మించడాని కవసరమైన యంత్రాలను, సాధనసామగ్రిని, సాంకేతిక నిపుణులను, ద్రవ్య నిధులను సేకరించాలంటే, తీరప్రాంత నగరాల్లో యిప్పుడున్న పారిశ్రామిక స్థావరాలమీద మనం ఆధారపడవలసి యుంటుంది; తీరప్రాంతాల్లో యిప్పుడున్న పారిశ్రామిక స్థావరాలు దేశంయొక్క పారిశ్రామికీకరణకు తొలిమెట్టు అని చెప్పవచ్చు. నిత్యమూ పెరిగే ప్రజావసరాలను, ప్రభుత్వావసరాలను తీర్చడానికేగాక, దేశంలోపల ఇంకా యెక్కువ బలీయమైన పారిశ్రామిక స్థావరా లను నిర్మించడానికికూడా తీరప్రాంతాల్లోని పారిశ్రామిక స్థావరా లను పూర్తిగా వినియోగించడం, పటిష్ఠమొనర్చడం అవసరం. అందుచేత రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం ఈశాన్య చైనాలోని పారిశ్రామిక స్థావరాన్ని యింకా పటిష్ఠమొనర్చాలి; తూర్పు, ఉత్తర, దక్షిణచైనాల తీరప్రాంతానికి సమీపంలోవున్న నగరాల పరిశ్రమలను పూర్తిగా వినియోగించుకొంటూ, వాటిని తగు స్థాయిలో పటిష్ఠమొనర్చాలి. అలా చేసినప్పుడే అవి జాతీయ నిర్మాణంలో ఎక్కువ చురుగ్గా పాల్గొనగల్గుతాయి.

తీరప్రాంత నగరాల్లో యిప్పుడున్న పారిశ్రామిక స్థావరా లను పూర్తిగా వినియోగించుకోవాలంటే, మనం వివేకవంతంగా ముందుకెళ్ళాలి; అనాలోచితపనులు చేయకూడదు. వివేకవంతంగా ముందు కెళ్ళడమంటే అర్థం, యిప్పుడున్న సంస్థల్లో వేటిని పున

ర్నిర్మించడం అవసరమో, సాధ్యమో వాటిని మాత్రమే పునర్ని ర్మించాలన్న మాట; అంతేగాని వాటన్నిటినీ పునర్నిర్మించడానికి పూనుకోరాదు. ఇదివరకే తగినన్ని పారిశ్రామిక సంస్థలున్న నగరాల్లో యితరచోట్లకంటే తక్కువ సంఖ్యలో కొత్తవాటిని నిర్మించాలి. అంతేకాదు. కొత్త సంస్థలను నెలకొల్పేటప్పుడు, పాత వాటిని పునర్నిర్మించే టప్పుడు ముడిపదార్థాలు, మార్కెటింగు పరిస్థితులు, సాంకేతిక పరిజ్ఞానం, రవాణా సౌకర్యాలు మొదలైన విషయాలనుకూడా దృష్టిలో ఉంచుకోవాలి; యితర ప్రాంతాలతో పని విభజన వివేకవంతంగా జరిగేటట్లు శ్రద్ధవహించాలి.

దేశంలోపలగాని, తీరప్రాంతాల్లోగాని పరిశ్రమలను భౌగోళికంగా పంచేటప్పుడు మనం అనుసరించవలసిన విధాన మెలా ఉండాలంటే, వాటిని సక్రమంగా పంచడంతోపాటు వాటిమధ్య సమన్వయం ఉడేటట్లుకూడా చూడాలి; ఒకేచోట మరీయెక్కువ పరిశ్రమలను స్థాపించే ధోరణిని, వివిధ పరిశ్రమలను సమన్వయించే విషయంలో ఉపేక్షవహించే ధోరణిని వ్యతిరేకించాలి.

పారిశ్రామిక రంగంలో ఉత్పత్తి సాధనాలను మనం వివేకవంతంగా పంచగలిగితే, అనేక కొత్తనగరాలను నిర్మించగల్గుతాం; అనేక పాతనగరాలను విస్తృతపరచగల్గుతాం. ఇందుకు మనం సిటీ ప్లానింగును, గృహనిర్మాణాన్ని పటిష్ఠమొనర్చాలి. అప్పుడుగాని వీటిని పారిశ్రామికాభివృద్ధితో సమన్వయపరచలేం.

(ఇ) పెద్ద సంస్థలనూ చిన్న – మధ్య తరహా సంస్థలనూ సమన్వయపరచే సమస్య: మొదటి పంచవర్ష ప్రణాళికకాలంలో ప్రారంభించబోతున్న పెద్ద పారిశ్రామిక సంస్థలు మన దేశంయొక్క సర్వసమగ్రమైన పారిశ్రామిక వ్యవస్థకు వెన్నెముక అని చెప్పవచ్చు. కాని, మనం పెద్ద పారిశ్రామిక సంస్థలతోపాటు, చిన్న – మధ్య తరహా సంస్థలనుకూడా తగినన్ని నిర్మించవలసిన అవసరం ఉంది. అప్పుడు మనం తక్కువ కాలంలో జాతీయ నిర్మాణావస

రాలనూ, ప్రజావసరాలనూ కూడా తీర్చగల పారిశ్రామిక సరకులను ఇంకా యెక్కువగా ఉత్పత్తిచేయగల్గుతాం.

పెద్ద పారిశ్రామిక సంస్థలను నిర్మించడం ఆర్థికంగాను, సాంకేతికంగాను ఎక్కువ వివేకవంతమైన పని అనీ, అందువల్ల పెద్దవాటిని ఎక్కువ సంఖ్యలోను, చిన్న-మధ్యతరహా సంస్థలను తక్కువ సంఖ్యలోను నిర్మించడం అవసరమనీ కొందరు అభిప్రాయపడుతున్నారు. మరికొందరు, చిన్న-మధ్యతరహా సంస్థలను త్వరితంగా నెలకొల్పవచ్చుననీ, వాటివల్ల రాబడికూడా త్వరితంగానే వస్తుందనీ, అందుచేత వాటినే ఎక్కువ సంఖ్యలో స్థాపించాలనీ భావిస్తున్నారు. ఈ రెండూ పొరపాటు అభిప్రాయాలే. కొన్ని పరిశ్రమల్లో, లేదా కొన్ని పరిస్థితుల్లో పెద్ద సంస్థలను నిర్మించడం వివేకవంతమవుతుంది; కాని యితర పరిశ్రమల్లో, లేదా యితర పరిస్థితుల్లో చిన్న-మధ్య తరహా సంస్థలను నిర్మించడమే వివేకవంతమవుతుంది. మొత్తంమీద చెప్పాలంటే, ప్రతి శాఖకూ వెన్నెముకగా వుండే పెద్దసంస్థలను కొన్నిటిని నిర్మించితీరాలి; వాటితోపాటు అనేక చిన్న-మధ్యతరహా సంస్థలను కూడ నిర్మించాలి; రెండిటి మధ్య సమన్వయం ఉండేటట్లు చూడాలి.

వివిధ సంస్థలను మనం వివేకవంతంగా నెలకొల్పాలంటే, అవసరమైనప్పుడూ అవకాశాలున్నప్పుడూ ఒక పెద్ద సంస్థను దశలవారీగానిర్మించవచ్చు. చిన్న-మధ్యతరహా సంస్థలవిషయమేమంటే, తగినన్ని వనరులూ యితర అనుకూల పరిస్థితులూ ఉన్నప్పుడు, ముందుముందు అభివృద్ధి కాగల ఒక సమగ్ర పథకాన్ని తయారుచేయవచ్చు. అంతేకాదు పెద్ద పారిశ్రామిక సంస్థలనూ, చిన్న-మధ్య తరహా సంస్థలనూ సమన్వయపరచడానికి ప్లాను తయారుచేసేటప్పుడు, మొదట యిప్పుడున్న చిన్న - మధ్యతరహా సంస్థలను, లేదా ప్రభుత్వ యాజమాన్యం క్రిందవున్న చేతి పరిశ్రమలను, లేదా సంయుక్త యాజమాన్యం క్రిందఉన్నవాటిని సవ్యంగా ఉప

యోగించుకోవాలి. వాటి ఉత్పత్తిశక్తిని చక్కగా వినియోగించుకోవాలి.

### 3. పారిశ్రామికోత్పత్తి యొక్క పెంపుదల

మొదటి పంచవర్ష ప్రణాళికలో, పారిశ్రామికోత్పత్తియొక్క మొత్తం విలువ 1952 లో కంటె 1957 లో 100 కి 90.3 వంతులు పెరుగుతుందని అంచనావేయబడింది. కేంద్ర కమిటీ సూచనల ప్రకారం, 1957 లో కంటె (ప్రణాళికయొక్క అంచనా) 1962 లో పారిశ్రామికోత్పత్తియొక్క విలువ దాదాపు రెట్టింపు కావలసియుంది. మొదటి ప్రణాళికలోకంటె రెండవ ప్రణాళికలో పారిశ్రామికోత్పత్తి యొక్క మొత్తం విలువ అంత త్వరితంగా పెరుగుతుందని భావించడానికి ఆధారాలేవంటే, యీ 5 సంవత్సరాల్లో కొత్తగా నిర్మింపబడే సంస్థల, పునర్నిర్మింపబడే సంస్థల సంఖ్య హెచ్చుతుంది; యిప్పుడున్న సంస్థలు ఉత్పత్తిని పెంచడానికి కొన్ని సాంకేతిక చర్యలు తీసుకుంటాయి; లేదా సాంకేతికంగా పునర్నిర్మింపబబడతాయి; సంయుక్త యాజమాన్యంక్రింద వున్న సంస్థలు ఆర్థికంగా పునర్నిర్మింపబడి ప్రధానంగా జాతిపర మవుతాయి; చేతి పరిశ్రమలన్నీ (కొన్నితప్ప) సహకార సంస్థల్లో సంఘటిత మవుతాయి; వ్యవసాయాభివృద్ధి కూడా త్వరితంగానే జరగవచ్చు.

పారిశ్రామికోత్పత్తి విషయంలో యీ క్రింది సమస్యలపై కొంత మాట్లాడదలచుకున్నాను:

(అ) వివిధ పారిశ్రామిక సంస్థల ఉత్పత్తి శక్తిని వినియోగించుకొనే సమస్య: అందాజా లెక్కలనుబట్టి, 1957 నాటికి కొత్త పారిశ్రామిక సంస్థలు, పునర్నిర్మింపబడ్డ సంస్థలు కలిసిచేసే ఉత్పత్తి మొత్తం పారిశ్రామికోత్పత్తియొక్క విలువలో 100 కి 15 వంతులుంటుంది. 1962 నాటికి ప్రథమ, ద్వితీయ ప్రణాళికల కాలంలో కొత్తగా నిర్మింపబడే సంస్థలు, పునర్నిర్మింపబడు సంస్థలు కలిసి చేసే

ఉత్పత్తి మొత్తం పారిశ్రామికోత్పత్తియొక్క విలువలో 100 కి 50 వంతు లుంటుంది. అందుచేత పారిశ్రామికోత్పత్తిని పెంచడానికి మనం నిర్మాణకృషిని పటుతరమొనర్చడం, యీ సంస్థలన్నిటినీ పూర్తిగా వినియోగించుకోవడం చాల ముఖ్యం.

కొత్త పారిశ్రామిక సంస్థల్లోను, పునర్నిర్మింపబడు సంస్థల్లోను — ముఖ్యంగా భారీ పరిశ్రమల్లో — పని ప్రారంభమైన తర్వాత పూర్తిగా తమ ఉత్పత్తి శక్తిని వినియోగించుకొనేటంత వరకు కొంతకాలం గడువు యివ్వాలి. ఈలోగా కార్మికులు, సాంకేతిక నిపుణులు యంత్రాలయొక్క లక్షణాలేమిటో, వాటి సామర్థ్య మెట్టిదో తెలుసుకొనగల్గుతారు; వివిధ సాంకేతిక శాఖలలో పరిచయ మేర్పరచుకోగల్గుతారు. అయితే, కార్మికులు, సాంకేతిక నిపుణులు పూర్తి ఉత్సాహంతో, బుద్ధికుశలతతో పని చేసేటట్లయితే, యీ గడువును తగ్గించుకోవచ్చు. అంతేకాదు; పథకాల్లో నిర్దేశించిన కొన్ని ఉత్పత్తి సామర్థ్యాలను అధిగమించవచ్చుకూడా. 1956 ఏప్రిల్‌లో తయారుచేయబడ్డ సంఖ్యా వివరాలనుబట్టి 1953 నుంచి 1955 వరకు ఉత్తమశ్రేణికి చెందిన 141 పారిశ్రామిక సంస్థలలో 30 సంస్థలు పథకాల్లో నిర్దేశించిన ఉత్పత్తి సామర్థ్యాన్ని అధిగమించాయి; 33 సంస్థలు అలా అధిగమించగల శక్తిని కలిగియున్నాయి; 71 సంస్థలు పథకాల్లో నిర్దేశించిన ఉత్పత్తి సామర్థ్యాన్ని సకాలంలో సంపాదించగల్గుతాయి; 7 సంస్థలు మాత్రమే ఈ విషయంలో విఫలమవుతాయి. అంటే, దాదాపు సగం పారిశ్రామిక సంస్థలు యీ గడువును తగ్గించుకోగలవన్న మాట; అవి పథకాల్లో నిర్దేశించిన ఉత్పత్తి సామర్థ్యాన్ని అధిగమించగలవన్నమాట. ఉదాహరణకు, షెన్యాంగ్ న్యూమాటిక్ టూల్స్ ఫ్యాక్టరీ యీమధ్య పునర్నిర్మింపబడింది. మరుచటి సంవత్సరాని కది తన నిర్ణీత సామర్థ్యాన్ని చేరుకోగలిగింది. నాలుగు సంవత్సరాల్లోగాని దానికి ఆ స్థాయిరాదని మొదట అంచనావేశాం. కాని 1957 నాటికి దాని నిర్ణీత సామర్థ్యం రెట్టింపు పెరుగుతుందని యిప్పుడు

అంచనా వేయబడుతూంది. మరొక ఉదాహరణ: పుషూన్ అల్యూమినియంవర్క్స్ అనే ఫ్యాక్టరీ కొత్తగా నిర్మింపబడింది. '55 జనవరిలో అది పని ప్రారంభించింది. డిసెంబరునాటికల్లా దాని నిర్ణీత సామర్థ్యం 100 కి 110 వంతులు పెరిగింది. దీన్నిబట్టి మనకు బోధపడే విషయమేమంటే, కొత్త పారిశ్రామిక సంస్థలు, పునర్నిర్మింపబడే సంస్థలు ఉత్పత్తిని అధికం చేయడానికెన్నో అవకాశాలున్నాయి. ఈ అవకాశాలను మనం పూర్తిగా వినియోగించుకోవాలంటే, ఉత్పత్తి క్రమం ప్రారంభం కాకముందు అనేక పూర్వ సన్నాహాలు చేయవలసియుంది. ముఖ్యంగా పనివారిని తరిఫీదు చేయాలి; వారికి సాంకేతిక పరిజ్ఞానం కలుగజేయాలి; అన్యోన్య సహకారాన్ని పెంపొందించాలి; వస్తుసామగ్రిని సప్లై చేయాలి. ఈ విషయాల్లో లభించిన అనుభవాన్ని ఆయా శాఖలు శ్రద్ధగా పరిశీలించి, క్రోడీకరించి, అందరికీ అందజేయాలి.

అయితే, కొత్త పారిశ్రామిక సంస్థలతోను, పునర్నిర్మింపబడ్డ వాటితోను సంతృప్తిచెంది, పాతవాటి విషయంలో యిక శ్రద్ధ చూపనవసరం లేదనుకోవడం పొరపాటు. రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో పాత పారిశ్రామిక సంస్థల ఉత్పత్తి మొత్తం పారిశ్రామికోత్పత్తి విలువలో తగినంత పెద్దభాగంగానే వుంటుంది. వాటి సహకారంమీద కొత్తగా నిర్మింపబడ్డ, పునర్నిర్మింపబడ్డ సంస్థలింకా ఆధారపడవలసే యుంటుంది. అందుచేత, వేర్వేరు పరిస్థితులలో మనం వేర్వేరు చర్యలు తీసుకోవలసి యుంటుంది. కొన్ని సంస్థలను క్రమబద్ధంగా పునర్నిర్మించడమో, సాంకేతికంగా ఆధునిక మొనర్చడమో చేయవలసి యుంటుంది. మరికొన్నిటి సాధనసామగ్రిని తిరిగి సర్దడం, కొంత కొత్తసామగ్రిని సప్లైచేయడం అవసర మవుతుంది. మిగతా సంస్థల సామర్థ్యాన్ని పూర్తిగా వినియోగించుకోడానికి వాటి పనిని, నిర్వహణను మెరుగుపరచాలి.

(ఆ) పారిశ్రామికోత్పత్తిలో స్పెషలైజేషనును (కొన్ని పరిశ్రమలు కొన్నిరకాల వస్తువులనే ఉత్పత్తిచేసే పద్ధతి), అన్యోన్య

సహకారాన్ని ప్రోత్సహించే సమస్య: పరిశ్రమల్లో—ముఖ్యంగా భారీ పరిశ్రమల్లో-స్పెషలైజేషను, అన్యోన్య సహకారంద్వారా శ్రామికోత్పాదకశక్తిని పెంచవచ్చు; ఉత్పత్తి ఖర్చులను తగ్గించవచ్చు; సాంకేతికాభివృద్ధిని పెంపొందించవచ్చు. కాని స్పెషలైజేషను, అన్యోన్యసహకారం పెంపొందించడమనేది చాల క్లిష్టమైన సమస్య. దాన్ని ప్రత్యేకంగా ఒక్కొక్క అడుగే వేసుకొంటూ, దీర్ఘకాల గడువులో పరిష్కరించవలసి యుంటుంది. దేశం యొక్క పారిశ్రామిక స్థాయిని, నిర్దిష్ట పరిస్థితులను, అవకాశాలను దృష్టిలో ఉంచుకొంటేనే యీ సమస్యను పరిష్కరించగలం; గుడ్డిగాను, బలవంతంగాను మాత్రం దీన్ని అమలు జరపకూడదు. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం ప్రస్తుతమున్న పెద్ద ఫ్యాక్టరీలను పూర్తిగా వినియోగించుకొంటూ, వాటి ఉత్పత్తి జాతీయ నిర్మాణావసరాలను, ప్రజల జీవితావసరాలను తీర్చగలిగేటట్లు చూస్తూ వచ్చాం. మరోవైపు యంత్రనిర్మాణ పరిశ్రమలో మనం ఆయా సరకుల రకాలనుబట్టి కొన్ని స్పెషలైజ్డ్ ఫ్యాక్టరీలను నిర్మించడం ప్రారంభించాం; అనేకరకాల సరకులను తయారుచేసే ఫ్యాక్టరీలలో కొన్నింటిని పునర్నిర్మించి, తద్వారా వాటిని స్పెషలైజ్డ్ ఫ్యాక్టరీలుగా మార్చాం. ఇవన్నీ చాల అవసరమైన చర్యలు. రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో కొన్ని స్పెషలైజ్డ్ఫ్యాక్టరీలను నిర్మించడంతోపాటు కొత్త పారిశ్రామిక సంస్థల, పునర్నిర్మింపబడిన వివిధ రకాలైనసంస్థల ఉత్పత్తి కార్యక్రమంలోమనం కొన్ని వివేకవంతమైన సర్దుబాట్లుకూడా చేయాలి. అలాచేస్తేనే, అనేకరకాల వస్తువులను తయారుచేసేధోరణిని, మరీ యెక్కువగా స్పెషలైజుచేసే ధోరణిని అధిగమించ గల్గుతాం. ఇప్పుడున్న సంస్థల విషయంలో ఒకవైపు ఉత్పత్తి వివేకవంతంగా జరగడానికి తగువిధంగా వాటి ఉత్పత్తి కార్యక్రమాన్ని సర్దుబాటు చేయాలి. మరోవైపు కొన్ని పెద్ద ఫ్యాక్టరీలను అలాగే వుంచాలి. సంయుక్త (ప్రభుత్వ-ప్రైవేట్) సంస్థలలో అనేకవాటి విషయ మేమంటే,

యింతవరకూ అవి తయారుచేస్తున్న సరకులను యికముందు కూడా తయారుచేయనివ్వాలి ; సమాజంయొక్క వివిధ అవసరాలను తీర్చేటందుకు, ప్రభుత్వ సంస్థలతో అవి సహకరించడానికి యిది. చాలా అవసరం. ఒక పారిశ్రామిక ప్రాంతంలోగాని, ఒక పారిశ్రామిక నగరంలోగాని ఉండే అవసరాలను, అవకాశాలను దృష్టిలో ఉంచుకొని, అవికొన్ని ఫోర్జింగులను, కాస్టింగులను, స్టాండర్డ్ సరుకులను ఉత్పత్తి చేసేటట్లు మనమొక సమగ్ర పథకాన్ని తయారుచేయవచ్చు. పారిశ్రామికోత్పత్తిలో స్పెషలైజేషను పద్ధతిని ప్రోత్సహించాలంటే, సరకుల రకాలు తగ్గిపోకుండా మాత్రం జాగ్రత్త వహించాలి.

పారిశ్రామికోత్పత్తి క్రమంగా స్పెషలైజేషన్‌వైపు అభివృద్ధి చెందేకొద్దీ, అన్యోన్య సహకారాన్ని ప్రోత్సహించవలసిన కర్తవ్యం కష్టతరంగాను, క్లిష్టంగాను తయారవుతుంది. అన్ని పనులూ ఒకే సంస్థ నిర్వహించాలనే ధోరణిని, సహకరించడానికి నిరాకరించే ధోరణిని మనం చక్కదిద్దాలి. ఏయే సంస్థలు అన్యోన్యంగా సహకరించాలో, సహకరించుకోగలవో తెలియజేస్తూ తమ తమ సాంవత్సరిక ప్రణాళికల్లో నిర్దిష్టమైన కర్తవ్యాలను రూపొందించి, తదనుగుణ్యంగా అవి ఒడంబడికలు చేసుకొనేటట్లు చూడాలి.

(ఇ) సరకుల నాణ్యాన్నీ, రకాలనూ పెంపొందించే సమస్య : అనేక పారిశ్రామిక సరకుల విషయంలో — ముఖ్యంగా తేలిక పరిశ్రమలు తయారుచేసే కొన్ని సరకుల విషయంలో — తగినంత నాణ్యం, తగినన్ని రకాలు లేకుండాపోతూంది. ప్రస్తుతం జరుగుతున్న పారిశ్రామికాభివృద్ధిలో యిదొక ముఖ్యసమస్యగా తయారైంది; అందువల్ల మన జాతీయ నిర్మాణం, ప్రజల జీవితం నష్టపడుతున్నాయి. అనేక భారీ పరిశ్రమల్లోను, తేలిక పరిశ్రమల్లోను తయారవుతున్న సరకుల నాణ్యం క్రమంగా పెరిగిందనే మాట వాస్తవమే; వాటిరకాలు కూడా హెచ్చాయి. కాని అన్ని పారిశ్రామిక సరకులకూ యిది వర్తించదు. కొన్ని పారి

శ్రామిక సరకుల నాణ్యం అంతకంతకు తగ్గిపోతూంది; వాటి రకాలు కూడా తగ్గిపోతున్నాయి. ఈ పరిస్థితిని తొలగించడానికి మనం తీవ్రంగా కృషిచేయాలి.

పారిశ్రామిక సరకుల నాణ్యం, వాటి రకాలు తగ్గడానికి చాలవరకు కారణం మన సాంకేతికస్థాయి, పాతకాలపు పరికరాలే ననుమాట నిజమే; కాని నాణ్యాన్నీ, రకాలనూ పెంపొందించడం అసాధ్యమనుకోవడం పొరపాటు; ఈ సాకుతో తక్కువ నాణ్యంగల సరకులను, తక్కువ రకాలను ఉత్పత్తిచేయడం మరీ తప్పు. మన పారిశ్రామికశాఖల్లో కొన్ని సరకుల నాణ్యం, రకాల విషయంలో తగినంత శ్రద్ధ చూపడంలేదు; యిందుకు దీర్ఘకాలపథకాలను తయారు చేసుకోడంలోను, గట్టి చర్యలు తీసుకోడంలోను అవి విఫల మవుతున్నాయి. పథకా లెలా అమలు జరుగు తున్నాయో తనిఖీ చేసేటప్పుడు తరచు యీ శాఖలు తమ ఉత్పత్తి లక్ష్యాలు నెరవేరాయా లేదా అన్న విషయమే ఎక్కువగా ఆలో చిస్తున్నాయి; నాణ్యానికి సంబంధించిన లక్ష్యాలు, కొత్త రకాలకు సంబంధించిన లక్ష్యాలు కూడా నెరవేరాయా లేదా అన్న విష యాన్ని పట్టించుకోడంలేదు. సరకులమొత్తాన్ని పెంచడం ద్వారా ఉత్పత్తి లక్ష్యాలను అధిగమించినవారికే బహుమతు లిస్తున్నారు; నాణ్యాన్నీ, రకాలనూ పెంచినవారి కివ్వడం లేదు. సరకుల నాణ్యం వాటి రకాలు తరిగిపోవడానికి యివన్నీ ముఖ్యమైన కారణాలు. అంతేకాక, గతంలో తేలిక పరిశ్రమల్లో తయారైన సరకులను వివిధ వాణిజ్యశాఖలు టోకుగా కొని, టోకుగా అమ్ముతూ ఉండేవి. ఎక్కువ నాణ్యంగల సరకులనూ, తక్కువ నాణ్యంగల వాటినీ, పాతరకాల వస్తువులనూ, కొత్తరకాల వస్తువులనూ ఒకేధరకు అమ్మడం, లేదా కొద్దిపాటి తేడాతో అమ్మడం జరుగుతూవుండేది. ఈ పద్ధతులవల్ల వివిధ పారిశ్రామిక సంస్థలు సరకుల నాణ్యాన్నీ, రకాలనూ పెంచే విషయంలో అశ్రద్ధచూపుతూ వచ్చాయి. అందుచేత, యిప్పటినుంచీ వివిధ

పారిశ్రామిక శాఖలు సాంకేతికాభివృద్ధికి దీర్ఘకాల పథకాలను తయారుచేసుకోవాలి; సరకుల నమూనాలను తయారుచేయడంలో వివిధ శక్తులను సంఘటితపరచాలి; కొత్త సరకుల నమూనాలను తయారుచేయడానికి, వాటిని ఉత్పత్తిచేయడానికి తగు నాయకత్వాన్ని పటిష్ఠమొనర్చుకోవాలి; వివిధ పారిశ్రామిక సంస్థల సాంకేతిక నిర్వాహణను చక్కబరచుకోవాలి; ముడిసరకుల సప్లైకి యేర్పాట్లుచేసుకోవాలి; నాణ్యమైన సరకులను ఉత్పత్తిచేసేవారికి బహుమతులిచ్చే పద్ధతిని ప్రవేశపెట్టాలి; కార్మికుల్నీ యితర సిబ్బందినీ సమీకరించి, సరకుల నాణ్యాన్నీ వాటి రకాలనూ ఎక్కువ చేసేటట్లు ప్రోత్సహించాలి. అదే సమయంలో వాణిజ్యశాఖలు కొన్ని రకాల సరకులను ఎన్నికచేసుకొనే పద్ధతినీ, నాణ్యాన్నిబట్టి ధరలను నిర్ణయించే పద్ధతినీ అమలుజరపాలి.

## 4. వ్యవసాయోత్పత్తిని పెంచే సమస్య

రెండవపంచవర్ష ప్రణాళికనుగురించి కేంద్రకమిటీచేసినసూచనల్లో, ధాన్యాల ఉత్పత్తి దాదాపు 2,20,000 కోట్ల కట్టీలవరకు ఉంటుందనీ, అందులో 1962 ఉత్పత్తి 50,000 కోట్ల కట్టీలనీ తెలియజేసింది. ఆ ఐదు సంవత్సరాల్లో పత్తి ఉత్పత్తి 21 కోట్లటాన్‌లవరకు వుంటుంది; 1962 లో దాదాపు 4 కోట్ల 80 లక్షల టాన్‌లుంటుంది. మొత్తం వ్యవసాయోత్పత్తియొక్క విలువ 1957 లో సాధించవలసిన లక్ష్యంకన్న 1962 లో దాదాపు 100 కి 35 వంతులు పెరుగుతుంది. అయితే, యీ క్రింది కారణాలవల్ల పై లక్ష్యాలను మించికూడా ఉత్పత్తి జరుగవచ్చునని అంచనా వేయబడుతోంది: ఒకవైపు, కొన్నిప్రాంతాల్లో తప్ప మిగతా ప్రాంతాలన్నిటిలోను ఉన్నతస్థాయికి చెందిన వ్యవసాయ సహకార సంస్థల నిర్మాణం అప్పటికి పూర్తి అవుతుంది; అందుచేత మనం 1956-'67 సంవత్సరాలకు తయారుచేసిన వ్యవసాయాభివృద్ధి ప్రణాళికను యింకా చక్కగా అమలుజరపగల్గుతాం; ఉత్పత్తిని అధికం చేయ

డాని కవసరమైన చర్య లన్నిటినీ పెద్దయెత్తున తీసుకొని, యీ విషయంలో మనం గడించే అనుభవాన్ని అందరికీ అందజేయగల్గుతాం; నీటి పారుదలవల్ల సాగయ్యే భూమి విస్తీర్ణాన్ని పెంచగల్గుతాం; రసాయనిక ఎరువుల సప్లైని అధికం చేయగల్గుతాం; ఉత్పత్తిసాధనాలను, సాంకేతిక నిర్వహణను మెరుగుపర్చగల్గుతాం. వీటన్నింటివల్ల వ్యవసాయోత్పత్తి మరింతపెరుగుతుంది. మరోవైపు అనేక ప్రకృతి విపత్తులవల్ల కలిగే నష్టాలు యిప్పటికీ అనివార్యంగానే వున్నాయి; పెద్ద నష్టాలను కలిగించే అనేక నదులను మన మింకా పూర్తిగా అదుపులో పెట్టజాలం; భూమిని పెద్దయెత్తున యింకాసాగులోకి తేజాలం; యంత్రాలతో వ్యవసాయంచేసేపద్ధతిని ప్రవేశపెట్టడానికి అనుకూల పరిస్థితు లింకా లేవు. వీటన్నిటివల్ల వ్యవసాయోత్పత్తిని అధికం చేసే కార్యక్రమానికి ఒక పరిమితి ఉంది. అయినప్పటికీ, పైన పేర్కొన్న అనుకూల పరిస్థితులను పూర్తిగా వినియోగించుకోడం, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో వ్యవసాయోత్పత్తిని పెంచడానికి కృషిచేయడం చాల అవసరం.

వ్యవసాయోత్పత్తిని పెంచే విషయంలో మనం యీ క్రింది సమస్యలపట్ల ప్రత్యేక శ్రద్ధ చూపాలి:

(అ) ఒక్కొక్క యూనిట్ ప్రాంతంలో పండే పంటను అధికంచేసే సమస్య : రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో వ్యవసాయోత్పత్తిని అధికంచేయడానికి ముఖ్యమైన పద్ధతి ఏమంటే, సహకారోద్యమ ప్రాతిపదికపై, రైతుల ఉత్సాహంమీద ఆధారపడుతూ, వ్యవసాయోత్పత్తి యొక్క సాంకేతిక నిర్వహణను మెరుగుపర్చాలి; ఇరిగేషన్ ప్రాజెక్టులను నిర్మించాలి; ఎరువుల ఉపయోగాన్ని ఎక్కువచేయాలి; నిపుణుల అనుభవాన్ని అందరికీ అందించాలి. ఇలా చేసినప్పుడు మనం ఒక్కొక్క యూనిట్ ప్రాంతంలోపండే పంటను ఎక్కువచేయగల్గుతాం. ఈ చర్యలను అమలుజరిపేటప్పుడు మనం ప్రభుత్వ కార్యకలాపాలనూ సహకార

సంస్థల కార్యకలాపాలనూ సమన్వయ పరచాలనే సూత్రాన్ని పాటించాలి.

ఇరిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణం : ఒకవైపు కేంద్రప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వాలు కొన్ని భారీ ఇరిగేషన్ ప్రాజెక్టులను, కొన్ని మధ్యరకం ప్రాజెక్టులను నిర్మించాలి. ఉదా: ఎల్లోనది, హువాయ్‌నది, హైహోనదులను శాశ్వతంగా అదుపులోపెట్టే స్కీములు, వివిధప్రాంతాల్లోని వరదనివారణ స్కీములు, ముంపు నివారణర స్కీములు. మరోవైపు సహకార సంస్థలు అనేక చిన్న ఇరిగేషన్ ప్రాజెక్టులను నిర్మించాలి; ఇప్పుడున్న ప్రాజెక్టులను మెరుగుపరచాలి. భూసారాన్ని నిల్వచేసే కార్యక్రమాన్ని పటిష్ఠ మొనర్చాలి. ముంపుకు లోనయే పల్లపు ప్రాంతాల్లో ముసుగు నివారణకు తీసుకోవలసిన చర్యలెలా ఉండాలో తెలుసుకొని, వాటిని అమలు జరపాలి; ముంపువల్ల కలిగే నష్టాన్ని తగ్గించేందుకు పాతవ్యవసాయ పద్ధతులను మార్చాలి.

ఎరువుల ఉపయోగం: ప్రభుత్వం ఒకవైపు రసాయనిక ఎరువుల పరిశ్రమను స్వయంగా అభివృద్ధిచేస్తూ, యితర దేశాల నుంచి వాటిని యింకా ఎక్కువగా దిగుమతి చేయడానికి ప్రయత్నించాలి. మరోవైపు సహకార సంస్థలు, వాటిలో సభ్యులుగా చేరిన వ్యక్తులు ప్రధానంగా పందులను పెంచి (కొన్ని ప్రాంతాల్లో గొర్రెలు), పచ్చి ఎరువును పోగుచేసి,యితర విధాలైన స్వాభావిక ఎరువులను సేకరించి, వాటి సహాయంతో భూమిని సారవంత మొనర్చాలి.

ఉత్పత్తిని పెంచడంలో వివిధ సాంకేతిక పద్ధతులను, నిపుణుల అనుభవాలను యితరుల కందజేసే విషయం: రైతులకు సాంకేతిక పద్ధతులను నేర్పడంలో మనం శ్రద్ధగా పనిచేయాలి. ఒక వైపు, ఉత్పత్తిని పెంచడంలో యితర ప్రాంతాల నిపుణులు గడించిన అనుభవాలను తెలుసుకొని, వాటిని స్థానిక పరిస్థితుల కనుగుణ్యంగా, శాస్త్ర ప్రయోగాలనూ అధ్యయనాన్నీ ఆధారంగా చేసుకొని

రైతుల కందజేయాలి. మరోవైపు, ఉత్పత్తిని పెంచడంలో స్థానికంగా నిపుణులు సంపాదించిన అనుభవాలను క్రోడీకరించడంలో శ్రద్ధ చూపాలి.

ఇక్కడ ఒక విషయం ప్రత్యేకంగా పేర్కొనవలసియుంది. కొత్తసాంకేతిక పద్ధతులను అమలు జరపడంలోను, నిపుణుల అనుభవాలను యితరుల కందించడంలోను మనం చురుగ్గానేకాక, వివేకంతోకూడ పనిచేయాలి. ఈ విషయంలో మనం గత కొద్ది సంవత్సరాల్లో గొప్ప ఫలితాలనే సాధించాం. కాని కొన్ని ప్రాంతాల్లో ముక్కుకు సూటిగా అన్వయించడం, బలవంతంగా అమలు జరపడం అనే పొరపాట్లు జరిగాయి. వాటివల్ల నష్టంవాటిల్లింది. ఇక మీదట ఉత్పత్తిని పెంచేపద్ధతులు, నిపుణుల అనుభవాలు సరియైనవేనన్న విషయంశాస్త్రప్రయోగాలద్వారా రుజువైనతర్వాతనే, వాటిని క్రమక్రమంగా రైతులకు బోధించాలి. అలా బోధించడంలో స్థానిక పరిస్థితుల కనుగుణ్యంగా, వాటిని అన్వయించడ మెలాగో కూడ తెలియజేయాలి. ఈలోగా స్థానిక రైతుల్ని – ముఖ్యంగా వృద్ధులైన, అనుభవజ్ఞులైన వారిని – సంప్రతించాలి; ఏ చర్యనూ, ఏ అనుభవాన్నీ బలవంతంగా రుద్దడానికి ప్రయత్నించకూడదు. అన్నిటికన్న ముఖ్యవిషయ మేమంటే, వ్యవసాయంలో పాతఅలవాట్లను దురుసుగా తిరస్కరించకూడదు.

(ఆ) వ్యవసాయ ఆర్థికవ్యవస్థలో వివిధశాఖలను అభివృద్ధి చేసే సమస్య: ధాన్యం ప్రజల నిత్యజీవితాని కవసరమైన వస్తువు; మొత్తం వ్యవసాయ ఆర్థిక వ్యవస్థకు ప్రాతిపదికకూడా యిదే. గత కొద్ది సంవత్సరాల్లో అన్నిప్రాంతాలూ ధాన్యం ఉత్పత్తిని, పత్తి ఉత్పత్తిని పెంచే సమస్యకు ఎక్కువ ప్రాముఖ్యత యిచ్చాయి. ఇది ఎంతో అవసరమే. కాని కొన్నిప్రాంతాలు యితర శాఖల్లో – పారిశ్రామిక పంటలు (పత్తి తప్ప), పశువుల పెంపకం, అటవీసంపద, చేపలుపట్టడం, చేతిపరిశ్రమలవంటి ఉపవృత్తులు –

ఉత్పత్తిని పెంచడానికి తగినంత ఆసక్తి చూపలేదు. దీనికితోడు ప్రభుత్వం రైతులవద్ద కొనే దినుసులకు తక్కువ ధరలు నిర్ణయించడంవల్ల కొన్ని వ్యవసాయ దినుసుల ఉత్పత్తి, ప్రత్యేకసరకుల ఉత్పత్తి తగ్గింది. వీటన్నిటివల్ల మన వ్యవసాయ ఆర్థికవ్యవస్థ సమగ్రంగాను, సంపూర్ణంగాను అభివృద్ధిచెందలేదు. మొత్తం మన జాతీయ ఆర్థిక వ్యవస్థకూ, రైతుల ఆదాయానికీ నష్టం కలిగింది. అందుచేత కేంద్రప్రభుత్వానికి క్రిందవున్న ప్రభుత్వాలూ, వ్యవసాయ సహకార సంఘాలవరకు అన్ని సంస్థలూ ఉత్పత్తినిగురించి ప్లానులు తయారుచేసేటప్పుడు ఆ యా ప్రాంతాల పరిస్థితులను, నైసర్గిక పరిసరాలను, ఆర్థిక – సాంకేతిక పరిస్థితులను, రైతుల వ్యవసాయ పద్ధతులను, వారి జీవితవిధానాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. అలా ఉంచుకొంటే, ఎప్పుడూ ఒక పంటకే ప్రాముఖ్యత యిచ్చేధోరణిని, ఒకే దృక్కోణంనుంచి ఆలోచించే పద్ధతిని నివారించగల్గుతాం. పశువులను విస్తారంగా పెంచేప్రాంతాల్లో పశు సంపదను అభివృద్ధిచేయడం, అటవీ ప్రాంతాల్లో ఆటవిక సంపదను వృద్ధిచేయడం, చేపలుపట్టే ప్రాంతాల్లో చేపల పరిశ్రమను పెంపొందించడం ప్రధానకర్తవ్యంగా పెట్టుకొని, ప్రణాళికలు తయారుచేసుకోవాలి. అదేసమయంలో, అవకాశాలనుబట్టి వ్యవసాయాన్నీ యితర ఉపవృత్తులనూ అభివృద్ధి చేయాలి.

మన వ్యవసాయ ఆర్థికవ్యవస్థను సర్వతోముఖంగా అభివృద్ధి చేయడానికి మనం అనేక నిర్దిష్టమైన చర్యలు తీసుకోవాలి. రైతులు చిరకాలంనుంచీ అలవాటుగా అనుసరిస్తున్న, సమాజానికి ఉపయోగ కరంగావున్న వ్యవసాయ పద్ధతులను కొనసాగించుకోనివ్వాలి; వాటిని యింకా అభివృద్ధిచేయాలి. సమాజానికి తక్షణమే కావలసిన సరకులు – ముఖ్యంగా ఎంతో ఆర్థిక ప్రాముఖ్యత గలవి (శీతల ప్రాంతాల్లోను, ఉష్ణప్రాంతాల్లోను పండేపంటలు, ఎగుమతిచేయడానికవసరమైన వ్యవసాయ దినుసులు, గృహ

పరిశ్రమలవంటి ఉపవృత్తులవల్ల తయారయే వస్తువులు) వీటన్నిటి ఉత్పత్తిని మనం ప్రోత్సహించాలి. సహకార సంఘాలు ప్రభుత్వమిచ్చే సాంకేతిక సహాయంతో వీటిని తయారుచేసేటట్లు చూడాలి. ఇవికాక కేంద్రప్రభుత్వం, క్రిందిప్రభుత్వాలు నిర్వహించే అనేక సంస్థలూ, తోటలూ ఉండనే ఉంటాయి. గృహపరిశ్రమలవంటి ఉపవృత్తులను సహకార సంస్థలే స్వయంగా నిర్వహించడం అనవసర మనుకున్న చోట్ల ఆ సహకార సంఘాల సభ్యులు ప్రత్యేకంగా యీ పరిశ్రమలను నిర్వహించేటట్లు ప్రోత్సహించాలి. ఇక వాణిజ్య శాఖలు వివిధసరకులను న్యాయమైన ధరలకు కొనేటట్లు, కొనుగోలు పద్ధతిని మెరుగుపరచేటట్లు చూడాలి. అదే సమయంలో, వ్యవసాయ సరకులను ప్రాసెసింగ్ చేసే పరిశ్రమలను సహకార సంస్థలు తగు మోతాదులో పునరుద్ధరించేటట్లు వాణిజ్యశాఖలు వాటికి సహాయం చేయాలి.

## 5. రవాణా, పోస్టల్ - టెలి కమ్యూనికేషన్ల అభివృద్ధి

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో వ్యవసాయ - పారిశ్రామికోత్పత్తి పెరిగేకొద్దీ, పెట్టుబడి నిర్మాణం యొక్క స్థాయి విస్తృతమయేకొద్దీ, తీరప్రాంతంలోను దేశాంతర్గత ప్రాంతాల్లోను నిర్మాణ కార్యక్రమం వృద్ధిచెందేకొద్దీ - రవాణా, టెలి కమ్యూనికేషన్ల అవసరం ఎక్కువవుతుంది. వీటిలో రైల్వేల నిర్మాణానికి మొదటి ప్రాధాన్యత యివ్వాలి. తదనుగుణ్యంగా దేశవ్యాపితమైన రవాణా మార్గాలను, కమ్యూనికేషన్లను నిర్మించవలసి యుంటుంది. ఈవిధంగా రవాణా, పోస్టల్ - టెలి కమ్యూనికేషన్ శాఖలు గురుతరమైన బాధ్యతలను నిర్వర్తించవలసి యుంటుంది. ఒకవైపు మనం ప్రస్తుతమున్న మార్గాలను, సౌకర్యాలను పునర్నిర్మించడం, సాంకేతికంగా వాటిని అభివృద్ధి చేయడం అవసరమవుతుంది. మరోవైపు కొత్తమార్గాలను - ముఖ్యంగా రైల్వేలను, హైవేలను - ఆగ్నేయ, నైరుతి ప్రాంతాల్లోను, రేవు పట్టణాల్లోను, యాంగ్సీ

నదిపైన నిర్మించే కార్యక్రమాన్ని కొనసాగించాలి; వీటితోపాటు రవాణా సౌకర్యాలను, కమ్యూనికేషన్ సౌకర్యాలను పెంచాలి. రవాణా, పోస్టల్ – టెలి కమ్యూనికేషన్ శాఖలు పైన పేర్కొన్న రెండు విధులనూ నెరవేర్చడానికి ఒక్కొక్క స్కీముయొక్క ప్రాముఖ్యతనుబట్టీ అవసరాన్నిబట్టీ సమగ్రమైనపథకాలను తయారు చేసుకోవాలి. అలా చేస్తేనే, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో రవాణా, పోస్టల్ – టెలి కమ్యూనికేషన్లను అభివృద్ధి చేయడానికి సూచింపబడ్డ కర్తవ్యాలను నిర్వర్తించ గల్గుతాం.

ప్రస్తుతం, కొన్ని మార్గాలలో రవాణా – టెలి కమ్యూనికేషన్లకు అప్పుడే కొన్ని చిక్కు లేర్పడ్డాయి. ఇందుకు ప్రధానమైన కారణం తగినన్ని సౌకర్యాలు లేకపోవడం. అయితే, కొన్ని రవాణా – కమ్యూనికేషన్ మార్గాల్లో యిప్పటికీ కొన్ని అనుకూల పరిస్థితు లున్నాయనీ, వాటిని మన మింతవరకు ఉపయోగించుకో లేదనీ గమనించాలి. అందుచేత రవాణా, పోస్టల్ – టెలి కమ్యూనికేషన్ శాఖలు కట్టుదిట్టమైన సాంకేతిక పద్ధతులను అవలంబించాలి; నిర్మాణ కృషిని పటుతరమొనర్చాలి.

మన దేశంలో ఆధునిక రవాణా సౌకర్యాలు, మార్గాలు లేనందున, ఉన్నవి క్రమబద్ధంగా పంచబడనందున, చిరకాలం నుంచీ సాంప్రదాయ సిద్ధంగా జంతువులు లాగే బళ్లు వగైరా అధికసంఖ్యలో విస్తృతంగా వ్యాప్తిలో ఉన్నందున, యివే చాల కాలంవరకు ముఖ్యమైన ఉపాంగాలుగా కొన్ని ప్రాంతాల్లో ప్రధానమైన రవాణా సాధనాలుగా ఉంటాయి కనుక – ఈ పురాతన సాధనాలను మనం పూర్తిగా ఉపయోగించుకొంటూ తగు విధంగా వాటిని అభివృద్ధి చేయాలి; క్రమక్రమంగా వాటిలో సాంకేతిక పద్ధతులను ప్రవేశపెట్టాలి. నానాటికి పెరుగుతున్న రవాణా అవసరాలను తీర్చడానికి సాధ్యమైనచోట్ల ఆధునిక సాధనాలను, పురాతన సాధనాలను కలిపి ఉపయోగించాలి.

## 6. వాణిజ్యరంగం పనిని పటుతరమొనర్చవలసిన ఆ వ శ్య క త

ప్రజల జీవితాన్ని మనం చక్కబరచాలంటే కేవలం ద్రవ్య రూపంలో వారి ఆదాయాన్ని పెంచడ మొక్కటే చాలదు; వారి అవసరాలకు తగినవిధంగా వివిధసరకులు నిర్దిష్టమైన ప్రమాణంలో లభించేటట్లుకూడా చూడాలి. అందాజా లెక్కలప్రకారం, 1957 నాటి ప్రణాళికా లక్ష్యాలకంటె 1962 లో మొత్తం చిల్లర వ్యాపారం – అంటే ప్రతిదినం విక్రయింపబడే వాడకం వస్తువులు, గ్రామీణ పట్టణ ప్రజలకు విక్రయింపబడే ఉత్పత్తి సాధనాల్లో ఒకభాగం – దాదాపు 100 కి 50 వంతులు పెరుగుతుంది. వాణిజ్య శాఖల కిది చాల కష్టమైనపని. అవి క్రయ విక్రయ వ్యాపారాలను పటుతరమొనర్చుకొంటూ ఉండాలి; ముఖ్యమైన జీవితావసర వస్తువులన్నిటినీ ఒక ప్లానుప్రకారం కొని అమ్మే పద్ధతినిని కొన సాగించాలి; వివిధప్రాంతాల్లో వర్తక కేంద్రాలను వివేకవంతంగా నెలకొల్పాలి; నానాటికి అధికమయే ప్రజల అవసరాలను తీర్చ డానికి ఒక ప్లానుప్రకారం, ప్రభుత్వసూచనలపై పనిచేసే స్వేచ్ఛా మార్కెట్లను స్థాపించాలి. మన జాతీయ నిర్మాణాని కవసరమైన యంత్రాలను, తదితర సాధనాలను దిగుమతి చేసుకొనేందుకు ఏయే సరకులను ఎగుమతిచేయాలో నిర్ణయించుకొని, వాటి ఎగు మతిని ఒక ప్లానుప్రకారం సంఘటిత మొనర్చాలి.

ఉత్పత్తి – వినిమయాలమధ్య, పారిశ్రామిక – వ్యవసాయో త్పత్తుల మధ్య ఒక లింకుగావున్న మన వాణిజ్యం ప్రజల నిత్యజీవితా వసరాలను, ఉత్పత్తియొక్క కొన్ని అవసరాలను తీర్చవలసి యుంటుంది; అంతేకాక, ప్రభుత్వ అవసరాలకై కొన్ని నిధులను కూడా నిల్వచేయవలసి యుంటుంది; పారిశ్రామిక – వ్యవసాయో త్పత్తులను ప్రోత్సహించవలసి యుంటుంది. మన ఆర్థిక జీవితంలో సరకుల విలువకు సంబంధించిన సూత్రం యిప్పటికీ కొంతపాత్ర

వహిస్తుంది గనుకను, కొన్ని రంగాల్లో అది ప్రధానపాత్ర నిర్వహిస్తుంది గనుకను ఆ సూత్రాన్ని మనం సవ్యంగా అన్వయించాలి; ధరల విధానాన్ని సరిగా అమలుజరిపితే, పారిశ్రామిక – వ్యవసాయోత్పత్తులు అభివృద్ధిచెందే అవకాశం ఉంది.

మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో సరకులధరలు మొత్తంమీద స్థిరంగానే ఉన్నాయి; పారిశ్రామిక సరకుల, వ్యవసాయ దినుసుల ధరలు సాపేక్షంగాచూస్తే మొత్తంమీద సరిగానే ఉన్నాయి. దీన్నిబట్టి మన ధరలవిధానం సరియైనదేనని బోధపడుతుంది. అది మన పారిశ్రామిక – వ్యవసాయోత్పత్తిని, జాతీయ నిర్మాణాన్ని అభివృద్ధి చేయడంలో తోడ్పడింది; సోషలిస్టుపరివర్తన నిరాటంకంగా పెంపొందడానికది ప్రోత్సాహ మిచ్చింది. కాని ధరల విధానాన్ని అమలు జరపడంలో కొన్నిలోపాలు, పొరపాట్లు కూడా జరిగాయి. ఉదాహరణకు, కొన్ని వ్యవసాయదినుసుల, ప్రత్యేక సరకుల, స్థానిక సరకుల కొనుగోలు ధరలు మరీ తక్కువగా నిర్ణయింపబడ్డామో, ఎక్కువ – తక్కువ ప్రమాణాలమధ్య మారుతూ ఉండడమో జరిగింది. తత్ఫలితంగా, వాటి ఉత్పత్తి అనుకున్న ప్రకారం పెరగలేదు. కొన్ని సందర్భాలలో తగ్గిందికూడా; తేలిక పరిశ్రమల్లో తయారైన కొన్ని రకాల, నమూనాల మధ్యధరల వ్యత్యాసం మరీ తక్కువగా ఉంది. అందువల్ల వాటి నాణ్యాన్ని మెరుగుపరచడం, రకాలను పెంచడం కష్టమయింది. ఈ లోపాలను గుర్తించి, క్రమక్రమంగా వాటిని సరిదిద్దగలిగాం. అయినప్పటికీ, అవి పూర్తిగా తొలగిపోలేదు; వాటిపై ఇంకా యెక్కువ పరిశీలనలు జరిపి, తగువిధంగా సర్దుబాట్లు చేయవలసియుంది.

ధరల విధానాన్ని సరిగా నిర్వహించటం అత్యంత క్లిష్టమైన విషయం. అందులోనూ అశేష జనాభాగల మన దేశంలో వివిధ ప్రాంతాల ఆర్థిక పరిస్థితులు ఎంతో భిన్నంగా వున్నాయి. కనుక

ధరలను సర్దుబాటు చేయటంలో మనం వివేచనతో వ్యవహరించాలి; తొందరపాటుతో ఏపనీ చేయకూడదు. ఉదాహరణకు మితిమీరిన ధరలకు వ్యవసాయ దినుసులను ఖరీదు చేశామా, పారిశ్రామికోత్పత్తికీ, కార్మికుల జీవితాలకూ హాని వాటిల్లుతుంది. అలాగే వివిధ రకాలైన పంటల ఉత్పత్తిని సరియైన నిష్పత్తిలో పెంపొందించాలన్న విధానానికి విఘాతం కలుగుతుంది. పారిశ్రామిక సరకుల అమ్మకపు ధరలను విపరీతంగా తగ్గించామా, దేశంలో వస్తువులకొరత ఏర్పడటాని కది దారితీస్తుంది. అందుచేత, అపసవ్యమైన తీరులో ధరలను పెంచటంగానీ, తగ్గించటంగానీ చేస్తే పారిశ్రామికోత్పత్తి పెరుగుదలకు, వ్యవసాయోత్పత్తి పెరుగుదలకు, ప్రజల జీవన ప్రమాణాభివృద్ధికి విఘాతం కలిగితీరుతుంది. కనుక రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మన దేశంలోని ధరలను స్థిరీకరించాలన్న విధానాన్ని అమలు జరపాలి. అయితే, అవసరమైన పక్షంలో బేసబబుగావున్న కొన్ని ధరలనుమాత్రం తగిన విధంగా సర్దుబాటు చేయాలి.

సోషలిస్టు పరివర్తన జయప్రదమైన ఫలితంగా, మన దేశంలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు ఆధిపత్య స్థానం సిద్ధించింది. దీనివల్ల విలువకు సంబంధించిన సూత్రాన్ని సరియైన హద్దులకు పరిమితం చేస్తూ, దానిని ఉపయోగించటం ద్వారా, మూల్యం దృష్ట్యా తక్కువగాను, రకం దృష్ట్యా అధికంగాను వుండే పారిశ్రామిక, వ్యవసాయోత్పత్తిని ఇతోధికం చేయటానికి వీలు కల్గుతుంది. ఆ సరకులను మొత్తంగా ప్రభుత్వమే ఖరీదుచేసి విక్రయించవలసిన అవసరంలేదు. కాని, ప్రజల బహుముఖ జీవితావసరాలను తీర్చటానికి మాత్రం ఆ సరకులు చాలా అవసరం. గూళ్ళకర్ర పద్ధతిలో, మితిమీరిన కంట్రోలు అమలు జరపటంవల్ల పైన పేర్కొన్న సరకుల నాణ్యం, వస్తువుల రకాలు తగ్గిపోయే ప్రమాదం వుంది. అలాంటిది జరగకుండా నివారించాలి. అందుకు వాణిజ్య రంగంలో యిప్పుడూ, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలోనూ,

ముఖ్యమైన అనేక చర్యలను మనం తీసుకోవాల్సి వుంటుంది. అలా తీసుకొన్నప్పుడే, పైన వివరించిన పరిస్థితులకు తగిన విధంగా వ్యవహరించిన వాళ్ళ మవుతాం. ఉదాహరణకు: సర్వ సమన్వితమైన ప్రభుత్వ మార్కెట్టు సారథ్యం క్రింద క్రమ బద్ధమైన పద్ధతిలో స్వేచ్ఛాయుతమైన అనేక మార్కెట్లను నెల కొల్పవచ్చు. కొన్ని పరిమితులకు లోబడి, ఉత్పత్తిదారులు తమ సరకులను ఆ మార్కెట్లలో అమ్ముకోటానికి అనుమతించవచ్చు. నిత్య జీవితావసర వస్తువులైన కొన్ని పారిశ్రామిక సరకులను వాటి నాణ్యాన్నిబట్టి ఎంచి, ఖరీదుచేసి, ధరలను నిర్ణయించే పద్ధతిని అమలుజరపాలి. ఇలా చేసినందువల్ల సర్వసమన్వితమైన ప్రభుత్వ మార్కెట్టు దెబ్బతినకపోగా, మరింత పటుతరం కావ టానికి తోడ్పడుతుంది.

## 7. పెట్టుబడిదారీ పరిశ్రమల్లోను, వాణిజ్యంలోను సోషలిస్టు పరివర్తన తీసుకొచ్చే సందర్భంలో, పారిశ్రామిక సంస్థలను ఉద్యోగుల ఏర్పాట్లను పునర్వ్యవస్థీకరించే సమస్య

సోషలిస్టు పరివర్తన కృషికి సంబంధించినంతవరకు ఈ క్రింది రెండు సమస్యలకు సంబంధించిన అంశాలను మాత్రమే నేనిక్కడ ప్రస్తావిస్తాను.

(అ) ప్రభుత్వ – ప్రయివేట్ సంయుక్త యాజమాన్యంలో గల పారిశ్రామిక సంస్థలను, చేతిపరిశ్రమదారుల సంస్థలను, చిన్న వ్యాపారస్తుల సహకారసంస్థలను పునర్వ్యవస్థీకరించే సమస్యను మొదట తీసుకొందాం.

పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థలు చాలకాలం క్రితమే ప్రభుత్వ – ప్రయివేట్ సంయుక్త యాజమాన్యంలోకి వచ్చాయి కనుక, వాటి ఉత్పత్తి, యాజమాన్యం క్రమంగా ప్రభుత్వ ప్రణా ళికలో అంతర్భాగంగా ఇంతకుపూర్వమే మారిపోయాయి; వాటి

నిర్వహణ, యాజమాన్య పద్ధతులలో మొత్తంమీద ప్రాథమిక మార్పులు పూర్తిఅయ్యాయి. అయితేచెల్లాచెదురుగావున్న చిన్న-మధ్యతరహా పారిశ్రామిక సంస్థలు మాత్రం ఇటీవలనే సంయుక్త యాజమాన్యంలోకి వచ్చాయి. కనుక వాటి నిర్వహణపద్ధతులను పునర్వ్యవస్థీకరించటం యింకా జరగలేదు. అనేకమంది వ్యక్తిగత చేతిపరిశ్రమదారులు, చిన్న వ్యాపారస్తులు, చిల్లరబేరగాళ్లు సహకార సంస్థలలో సభ్యులుగా చేరారు. వారి విషయంలోకూడా పునర్వ్యవస్థీకరణను, తగిన ఏర్పాట్లను యింకా చేయవలసివుంది. లేకపోతే వారి ఉత్పత్తి, వ్యాపారం సరిగా కొనసాగడం దుర్లభమవుతుంది. ప్రభుత్వంయొక్క క్రమబద్ధమైన యాజమాన్యపద్ధతికి వారు అలవాటుపడేటట్లు చేయాలి. అయితే, వాటిని పునర్వ్యవస్థీకరించేటప్పుడు మాత్రం మనం ఒకవిషయం గుర్తుంచుకోవాలి. మితిమీరిన కేంద్రీకరణ హానికరం కనుక, అలాంటిది జరగకుండా జాగ్రత్తపడాలి.

పారిశ్రామిక రంగంలో స్వల్ప ప్రామాణికమైన ఫ్యాక్టరీలకు కొన్ని బలహీనత లున్నప్పటికీ వాటి ఉత్పత్తి నిర్వహణను ఎప్పటికప్పుడు సమయోచితంగా మార్చుకోటం చాలా సులభం; అంతేకాక, అనుదినం మారిపోయే అవసరాలకు అనుగుణంగాకూడ వాటిని మార్చుకోటం చాలా తేలిక. అందుచేత, లాభదాయకమైన పద్ధతిలో నిర్వహించబడుతున్న చిన్న ఫ్యాక్టరీల మనుగడను మనం కాపాడాలి; వాటిని పూర్తిగా నిర్మూలించటంగానీ, పెద్ద పరిశ్రమలలో వాటిని విలీనం చెయ్యటంగానీ తగదు. పోతే, చేతిపరిశ్రమదారుల సహకారసంస్థల విషయంలో మితిమీరిన కేంద్రీకరణనుఅమలుజరపటం ఎట్టిపరిస్థితులలోనూ పనికిరాదు. ఉత్పత్తిని పెంచి, సమాజ అవసరాలను తీర్చుతూ, ప్రజల ఆదాయాన్ని పెంచాలన్న సూత్రాన్ని మనం తు. చ. తప్పకుండా పాటిస్తూఉండాలి. పెద్దపెద్ద సహకార సంస్థలతోపాటే, చిన్న చిన్న సహకార సంస్థలనుకూడా బ్రతకనీయాలి. కొన్ని తరహాలకు

చెందిన వృత్తులను, ముఖ్యంగా అనేక బాగు చేతల వృత్తులను, వ్యక్తిగత అవసరాలను తీర్చే వృత్తులను ప్రస్తుతం వున్నవివున్నట్టు గానే కొనసాగనీయాలి; ఎందుకంటే, అవి అలా కొనసాగినప్పుడే పౌరుల అవసరాలను సరాసరి తీర్చగలుగుతాయి; కుటుంబం తీరిక సమయాల్లో వినియోగించగల ఉత్పాదన శక్తిని ఆవిధంగాఉపయోగించుకో వీలవుతుంది. చేతి పరిశ్రమల్లో నెలకొల్పబడ్డ సహకార సంస్థల ఆధిపత్యం క్రింద కొన్ని చేతిపరిశ్రమల ఉత్పత్తిని స్వేచ్ఛగా కొనసాగ నివ్వాలి; ఆ పరిశ్రమలలో తయారయ్యే వస్తువులను అవే అమ్ముకొనేందుకు కూడా అనుమతించవచ్చు.

వ్యాపారానికి సంబంధించినంతవరకు, ప్రజల అవసరాలను సాధ్యమైనంత ఎక్కువగా తీర్చటానికి వీలుగా వ్యాపారాన్ని పంచాలి. అందుచేత వ్యాపారంలో మితిమీరిన కేంద్రీకరణను ప్రవేశపెట్టటం మరింత అసంమజసం అవుతుంది. పౌరుల అవసరాలను అనేకవిధాల తీర్చేవిధంగా వ్యాపారాన్ని సరియైన పద్ధతిలో అన్ని ప్రాంతాలకూ వ్యాపింపచేయాలి. ముఖ్యమైన,మన వ్యాపార సంస్థలు తమ నిర్వహణ ఉసులుబాటును మాత్రమే ప్రధానంగా చూసుకొంటున్నాయేకాని, పౌరుల సౌలభ్యంగురించి అంతగా ఆలోచించటంలేదు. తత్ఫలితంగా మితిమీరిన కేంద్రీకరణ ధోరణి పెచ్చరిల్లుతోంది. చిన్న చిన్న షాపులను ఎత్తివేయటం జరుగుతోంది. చిల్లర వ్యాపారస్తులను, చిల్లర బేరగాళ్ళను తగ్గించటం జరుగుతోంది. ఈ ధోరణిని మనం వెంటనే సరిదిద్దుకోవాలి. ఇక ముందు మనం నగరాలలో జనం నివసించే పేటలలోను, విశాలమైన గ్రామీణ ప్రాంతాలలోను ప్రజల అవసరాలను సక్రమంగా తీర్చటంకోసం చిన్నచిన్న వ్యాపారస్తులు, చిల్లరబేరగాళ్లు గణనీయ సంఖ్యలో వుండేటట్లు చూడాలి. ప్రభుత్వం తరఫున కమిషన్ ఏజెంట్లుగానో సొంతంగా వస్తువులను ఖరీదుచేసె అమ్ముకొనేవిధంగానో చిన్నచిన్న వ్యాపారస్తులు, చిల్లర బేరగాళ్ళు, సహకార

షాపులు, సహకార గ్రూపులు, పంపిణీదారుల రూపాలలో పనిచేసే టట్లు చూడాలి.

(ఆ) పారిశ్రామిక, వ్యాపార పెట్టుబడిదారులకు, చిన్న చిన్న యజమానులకు పనులు చూపించి, వారిలో మానసిక పరివర్తన తీసుకువచ్చే సమస్యను పరిశీలిద్దాం.

పెట్టుబడిదారీ పరిశ్రమలను, వాణిజ్యాన్ని ప్రభుత్వ - ప్రయివేట్ సంయుక్త నిర్వహణలోకి తీసుకొచ్చిన పిమ్మట, పారి శ్రామిక సంస్థలలో ముఖ్యమైన బాధ్యతలను నిర్వహించగలిగేటట్లు ప్రముఖులైన కార్మికులకు, ఉద్యోగులకు మనం శిక్షణ యివ్వాలి. అదేసమయంలో ఇంతకుపూర్వం పారిశ్రామిక, వాణిజ్య పెట్టుబడి దారులుగా వున్నవారికి, చిన్న యజమానులుగా వున్నవారికి కూడా కొన్ని నిర్వహణ, యాజమాన్య బాధ్యతలను అప్పగించటమో, వారిని ముఖ్యపదవులలోకి తీసుకోవటమో చేయాలి. సంయుక్త నిర్వహణ పద్ధతినీ, పెట్టుబడిదారులకు నిర్ణీతమైన వడ్డీ చెల్లించే పద్ధతినీ అమలుజరపటంవల్ల పారిశ్రామిక సంస్థలలో పనిచేస్తున్న బూర్జువావర్గానికి చెందినవారు ద్వంద్వాత్మలయ్యారు. వారు ఒకప్రక్క పెట్టుబడిదారులుగాను, మరొకప్రక్క ఉద్యోగులుగాను వుంటున్నారు. అందుచేత, పెట్టుబడిదారీ ప్రయోజనాలకు ప్రాతి నిధ్యం వహించేవారితో ప్రభుత్వ వాటాకు ప్రాతినిధ్యం వహించే వారు పూర్తిగా సహకరిస్తూ పనిచేయాలి; వారికిగల ప్రత్యేక పరి జ్ఞానాన్ని ఉపయోగించటానికి, చొరవను ప్రదర్శించటానికి స్వేచ్ఛ యివ్వాలి; అలా వారితో కలిసి పనిచేస్తూనే, వారికి విషయాలను బోధిస్తూ, బూర్జువాభావాల ప్రభావంనుంచీ బూర్జువా పనిపద్ధ తులనుంచీ బయటపడటంలో వారికి సాయపడాలి. వారు పనిపాట లలో విజయాలను సాధించగలిగేటట్లు తోడ్పడాలి. తద్వారా వారిని నిజమైన శ్రమజీవులుగా మార్చాలి. వారివిషయంలో వ్యతిరేకవైఖరి నవలంబించటం మన కెంతమాత్రం పాడికాదు.

పారిశ్రామిక సంస్థల అభివృద్ధికీ, ప్రభుత్వ శ్రేయస్సుకూ కార్మిక వర్గ శ్రేయస్సుకూ మనం పాటుపడాలంటే, పైన పేర్కొన్నవిధం గానే వ్యవహరించవలసి వుంటుంది. ఈ కర్తవ్యాన్ని మనం సంతృప్తికరంగా నిర్వహించాలంటే, పారిశ్రామిక సంస్థలలో పని చేస్తున్న కార్మికులకు, ఉద్యోగులకు ఈ విషయాలన్నిటిని వివరించి చెప్పాలి. పెట్టుబడిదారులలోను, వారి ప్రతినిధులలోను మానసిక పరివర్తన తీసుకురావటానికి చేయవలసిన కృషి ఎంతముఖ్యమో వారికి సుబోధకం చేయాలి.

ప్రభుత్వ - ప్రయివేట్ సంయుక్త నిర్వహణ క్రిందగల పారి శ్రామిక సంస్థలలో పనిచేస్తున్న వందలాది పెట్టుబడిదారులలోను, వారి ప్రతినిధులలోను అధికసంఖ్యాకులు కొంత ఉత్పత్తి నైపుణ్యం, నిర్వహణానుభవం కలవారు. అత్యున్నత నైపుణ్యం, విశేష అనుభవం కలవారుకూడా వారిలో కొందరున్నారు. వారి ఉత్పత్తి నైపుణ్యాన్ని, నిర్వహణానుభవాన్ని మనం పూర్తిగా ఉపయోగించు కోవాలి. ప్రభుత్వ వాటాకు ప్రాతినిధ్యం వహించేవారు ఈ విష యాలలో వారినుంచి నేర్చుకోటానికి ప్రయత్నించాలి.

## 8. ప్రభుత్వ పరిపాలనా యంత్రాన్ని మెరుగుపర్చి, స్థానిక చొరవను పూర్తిగా వినియోగంలోకి తీసుకొచ్చే సమస్య

రెండవ పంచవర్షప్రణాళిక కాలంలో క్రింది ప్రభుత్వాల ఆధ్వర్యాన లేదా కేంద్ర ప్రభుత్వంయొక్క- క్రింది ప్రభుత్వాల యొక్క సంయుక్త ఆధ్వర్యాన మన దేశంలో నిర్మించవలసిన ప్రాజెక్టుల సంఖ్య పెరుగుతుంది. అందుచేత, సోషలిస్టు పరివర్త నను జయప్రదంగా పూర్తిచేయాలంటే, క్రింది ప్రభుత్వాల చొర వకు పూర్తి స్వేచ్ఛ ఒసగటం తప్పనిసరి అవుతుంది.

మన దేశంలో సోషలిస్టు పరివర్తనకు సంబంధించినంతవరకు యిప్పటికే నిర్ణయాత్మకమైన విజయం సాధించాం కనుక, మన నూతన ప్రజాతంత్ర నియంతృత్వం మరింత పటుతరమైంది కనుక,

సమైక్య నాయకత్వ సూత్రాన్నీ వివిధ స్థాయిల పరిపాలనా విధానాన్నీ గుర్తుంచుకొంటూ, ప్రతి ప్రాంతంలోను, ప్రతి విషయంలోనూ కేంద్ర ప్రభుత్వానికి ఏయే అధికారాలుండాలి, క్రింది ప్రభుత్వాలకు ఏయే అధికారాలుండాలి అన్న విషయాన్ని మరింత స్పష్టంగా తేల్చుకోవలసిన అవసరం ఏర్పడింది; అలాగే స్థానిక చొరవకు పూర్తి స్వేచ్ఛ యిచ్చే నిమిత్తం ప్రభుత్వ పరిపాలనా యంత్రాన్ని మెరుగుపర్చవలసిన అవసరంకూడా ఏర్పడింది. ఈ సంవత్సరం మే – ఆగస్టు మాసాల మధ్యకాలంలో మంత్రి మండలి ప్రభుత్వ పరిపాలనా వ్యవస్థను గురించి చర్చించే నిమిత్తం అనేక జాతీయ సమావేశాలను ఏర్పాటుచేసింది. ప్రస్తుత పరిస్థితులలో అమలులోనున్న మితిమీరిన కేంద్రీకరణను గురించి ఆ సమావేశాలలో ఆలోచించాం; ప్రభుత్వ పరిపాలనా యంత్రాన్ని యింకా బాగుపర్చటం ఎలాగ అన్న సమస్యను పరిశీలించాం; ప్రభుత్వ పరిపాలనా యంత్రాన్ని బాగుపర్చటానికి ఒక ముసాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించాం. ఆ ముసాయిదా తీర్మానంపై వివిధ వర్గాలనుంచి విరివిగా సలహాలు, సూచనలు సేకరించటానికి ప్రస్తుతం మంత్రిమండలి కృషిచేస్తోంది.

కేంద్రప్రభుత్వానికి ఏయే అధికారాలుండాలో, క్రింది ప్రభుత్వాలకు ఏయే అధికారా లుండాలో నిర్ణయించేటప్పుడు మనం ఈ క్రింది సూత్రాలను పాటించాలి: (1) సరాసరి కేంద్రప్రభుత్వంక్రిందగల రాష్ట్రాలకు, స్వయంపాలితప్రాంతాలకు, మ్యునిసిపాలిటీలకు ద్రవ్యం, ప్రణాళిక, పరిశ్రమలు, పబ్లిక్ సంస్థలు, సరుకులు, ఉద్యోగులు మున్నగు విషయాల్లో నిర్ణీతమైన పరిమితిలో అధికారా లొసగే నిర్దుష్టమైన నిబంధనలను రూపొందించాలి. (2) మన జాతీయ ఆర్థికవ్యవస్థకు చాల ముఖ్యమైన, సమగ్ర స్వభావంగల పబ్లిక్ సంస్థలను, పారిశ్రామిక సంస్థలను కేంద్ర ప్రభుత్వమే నిర్వహించాలి; మిగతావాటన్నింటినీ సాధ్యమైనంత

వరకు క్రిందిప్రభుత్వాలకే వదలిపెట్టాలి. పారిశ్రామికసంస్థల, పబ్లిక్ సంస్థల నిర్వహణబాధ్యతను క్రిందిప్రభుత్వాలకు అప్పజెప్పేటప్పుడు, వాటికి సంబంధించిన ప్రణాళికాంశాలు, ద్రవ్యవిషయాలు, ఉద్యోగుల ఏర్పాట్లు మున్నగువాటిని కూడా సాధారణంగా క్రిందిప్రభుత్వాలకే వదలిపెట్టాలి. (3) పారిశ్రామిక, పబ్లిక్ సంస్థల నిర్వహణను మరింత సమర్థవంతం చేయాలి; కాగా, ద్వంద్వపరిపాలనలోగల సంస్థలవిషయంలో కేంద్రప్రభుత్వ సారథ్యాన్ని, క్రిందిప్రభుత్వాల నిర్వహణకృషిని మెరుగుపర్చి, ఆ సంస్థలపై మన నాయకత్వాన్ని పటుతరమొనర్చాలి. (4) ముఖ్యమైన ప్రణాళికలను, ఆర్థిక లక్ష్యాలను క్రింది ప్రభుత్వాలకు పంపేటప్పుడు వాటిని కేంద్ర ప్రభుత్వం సమన్వయపద్ధతిలో జారీచేయాలి; అంతేకాని, యిప్పటి వరకు జరుగుతున్నట్లుగా కేంద్ర ప్రభుత్వంలోని ఏశాఖకు ఆ శాఖ స్వయంగా ముఖ్యమైన లక్ష్యాలను జారీచేయటం మంచిదికాదు. (5) కొన్ని ముఖ్యమైన ప్రణాళికా లక్ష్యాలు ఉద్యోగుల సంఖ్య విషయంలో సమయోచితమైన సర్దుబాట్లు చేసుకోటానికి క్రింది ప్రభుత్వాలకు కొంత స్వేచ్ఛ యివ్వాలి. (6) జాతుల స్వయం పాలిత ప్రాంతాలలో వివిధ స్వయంపాలిత హక్కులకు సంబంధించినంతవరకు కొన్ని నిర్దిష్టమైన నిబంధనలు రూపొందించాలి. మైనారిటీ జాతుల ప్రాంతాలను రాజకీయంగాను, ఆర్థికంగాను, సాంస్కృతికంగాను అభివృద్ధిచేయటానికి తోడ్పడాలి. (7) ప్రభుత్వ పరిపాలనా యంత్రాన్ని క్రమక్రమంగా మెరుగుపర్చాలి. ముఖ్యమైన కొన్ని మార్పులను క్రమబద్ధమైన పద్ధతిలో మాత్రమే ప్రవేశపెట్టాలి. ఇంకా వివరంగా చెప్పాలంటే, అలాంటి మార్పులకు ఈ సంవత్సరం సన్నాహాలు చేసి, వచ్చే సంవత్సరంలో ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టి, వాటిని రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో అమలుజరపాలి.

పైన పేర్కొన్న సూత్రాలను సమగ్రవంతంగా అమలు జరపాలంటే, కేంద్ర ప్రభుత్వపు సమైక్య నాయకత్వంక్రింద క్రింది

ప్రభుత్వాల అధికారాలను తగినంతగా యిత్తోధికం చేయవలసి యుంటుంది. పారిశ్రామిక సంస్థలలోని ప్రాథమిక యూనిట్లతోను, పబ్లిక్ సంస్థలతోను, ప్రజలతోను స్థానికాధికారులకు సన్నిహిత సంబంధం వుంటుంది. అందువల్ల స్థానిక పరిస్థితు లేమిటో వారు బాగా అర్థంచేసుకోగల్గుతారు. కనుక సోషలిస్టు నిర్మాణానికి స్థానిక శక్తు లన్నింటినీ, నిర్మాణాత్మకాంశా లన్నింటినీ చక్కగా విని యోగించే నిమిత్తం స్థానికాధికారులకు తగిన విధంగా యిత్తోధికాధికారాలను ఒసగవలసి వుంటుంది.

స్థానిక చొరవను పూర్తిగా వినియోగంలోకి తీసుకొచ్చేందుకు, దేశంలోని జాతులన్నిటి మధ్య ఐక్యతను మరింత పటుతరం కావించేందుకు మనం ప్రస్తుతదశలోను, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలోను మైనారిటీ జాతులలో చేయవలసిన కృషిపై దృష్టిని కేంద్రీకరించాలి. మైనారిటీ జాతులకు చెందినవారి సంఖ్య, నిర్ణీత ప్రమాణంమేరకు గల ప్రతిచోట స్వయం పరిపాలన యింకా నెలకొల్పబడకపోతే, రాజ్యాంగ నిబంధనల ప్రకారం ఆ యా చోట్ల అలాంటి పరిపాలనను నెలకొల్పటానికి పూనుకోవాలి. మైనారిటీ జాతులకు చెందిన కార్యకర్తలకు శిక్షణగరిపి, ఎక్కువ సంఖ్యలో వారిని ఉన్నత పదవులకు ప్రమోట్ చేయాలి; వారి రాజకీయ అవగాహనను పెంపొందించటానికి నిరంతరం కృషిచేయాలి; వివిధ సమస్యలను సమర్థవంతంగా పరిష్కరించగలిగేటట్లు వారిని అభివృద్ధిచేయాలి. ఆ విధంగా వారి కప్పగించిన బాధ్యతలను చక్కగా నిర్వహించగలిగేటట్లు చేయాలి. మైనారిటీ జాతులవారు ఒకేచోట గూడుగా నివసిస్తున్న చోట్ల, లేక ఒకే ప్రాంతంలో కలిసి జీవిస్తున్న చోట్ల లేక ఇతర జాతుల మధ్య చెల్లాచెదురుగా నివసిస్తున్న చోట్ల, జాతుల సరిసమాన హక్కులను, మతస్వేచ్ఛను, ప్రతి మైనారిటీ జాతియొక్క ఆచార వ్యవహారాలను, సంప్రదాయాలను, భాషను పూర్తిగా గౌరవించే

టట్లు చూడాలి. ఒకవేళ ఏ మైనారిటీ జాతుల భాషకైనా లిపి రూపొందకపోయినా, ఒక వేళ రూపొంది తగినంతగా అభివృద్ధిచెందక పోయినా, ఆయా భాషలను లిఖితపూర్వకమైన భాషలుగా రూపొం దించటానికి, సంస్కరించటానికి కృషిచేయాలి.

## 9. నిర్మాణకృషికి, శాస్త్రీయ పరిశోధనకు నిపుణులను తయారుచేసుకొనే సమస్య

రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో సోషలిస్టు పారిశ్రామికీ కరణకు గట్టిపునాదులు వేయటానికీ, జాతీయ నిర్మాణ కార్య క్రమాన్ని కొనసాగించటానికీ, మన జాతీయ ఆర్థిక వ్యవస్థను సాంకేతికంగా పునర్నిర్మించే కృషిని త్వరితం చేయటానికీ, నిర్మాణ కృషిని, శాస్త్రీయ పరిశోధనను కొనసాగించే నిపుణులను తయారు చేసుకొనే నిమిత్తం మనం గట్టిప్రయత్నాలు చేయాలి.

(అ) నిర్మాణకృషి కొనసాగించే నిపుణులను తయారుచేసి పంపిణీ చేసే సమస్య: నిర్మాణకృషి కొనసాగించే నిపుణులకు, ముఖ్యంగా పారిశ్రామిక సాంకేతిక నిపుణులకు, శాస్త్రీయ పరి శోధనానిపుణులకు శిక్షణగరిపే కర్తవ్యం గురుతరమైనదిగావుంటుంది. గత కొలది సంవత్సరాలలో అలాంటి నిపుణులను తయారుచేసుకో టానికి మనం సాగించిన కృషి గణనీయంగా ఫలించిందనే చెప్ప వచ్చు. అయితే, మన నిర్మాణ అవసరాలను దృష్టిలో పెట్టుకొంటే, మన విశ్వ విద్యాలయాలలోను, కళాశాలల్లోను, ఉన్నత వృత్తి విద్యాలయాల్లోను శిక్షణ పొందేవారి సంఖ్య మన అవసరాలకు ఏ మాత్రం సరిపోవటంలేదు. ముఖ్యంగా నైపుణ్యం విషయంలోను, శిక్షణ గరిపే విషయంలోను మనం చాలా వెనుకబడివున్నాం. అందు చేత రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో మనం ఉన్నత విద్యను, ఉన్నత వృత్తి విద్యను పెంపొందించాలి. "అత్యంత ముఖ్యమైన విషయాలకు అగ్రతాంబూలమిస్తూ, మిగతా వాటికి తగినంత ప్రాధాన్య మొసగాలి" అన్న సూత్రం ప్రకారం సమగ్రమైన పథ

కాలను రూపొందించాలి. అవసరాలకు, అవకాశాలకు మధ్య చక్కని సమన్వయం సాధించాలి.

నిర్మాణకృషి సాగించటానికి నిపుణులను తయారుచేసే విషయంలో, రాశికీ గుణానికీ మధ్య వుండవలసిన సంబంధాలను పరిగణనలోకి తీసుకొంటూ మన కృషిని మెరుగుపర్చవలసి వుంటుంది. గత కొలది సంవత్సరాలుగా మనం సంఖ్యకుమాత్రమే ప్రాముఖ్యమిస్తూ, గుణాత్మకాంశాన్ని విస్మరిస్తూ వచ్చాం. ఆ ధోరణిని తక్షణం సరిదిద్దుకోవాలి. విద్యార్థుల సామర్థ్యం, నైపుణ్యం కొంత పరిమితిలో వుండేటట్లు చూస్తూ, వారి సంఖ్యను సాధ్యమైనంత ఎక్కువగా పెంచటానికి విద్యాసంస్థలు శక్తివంచన లేకుండా పాటుబడాలి. ప్రభుత్వసంస్థలకు, తదితర సంస్థలకు కార్యకర్తలు చాలామంది అవసరమన్నమాట నిజమే. అయినప్పటికీ, అవసరాలతోపాటు అవకాశాలనుకూడా పరిగణనలోకి తీసుకొంటూ, ఆ సంస్థలు కార్యకర్తలకోసం డిమాండ్ పెట్టాలి. లేకపోతే వివిధసంస్థలలో ఉత్తీర్ణులవుతున్న విద్యార్థులు సరిపోరు. ప్రభుత్వసంస్థలు, ఇతరసంస్థలు కోరుతున్న ప్రకారం కార్యకర్తలను సప్లై చేయడానికి మంచిచెడులు ఆలోచించకుండా విద్యార్థులసంఖ్యను పెంచవలసివస్తుంది. అలాంటి పరిస్థితి ఏర్పడకుండా చూడాలి.

ఇటు ఉన్నత విద్యా విషయంలోను, అటు ఉన్నత వృత్తి విద్యా విషయంలోను ఆచరణకు సంబంధించిన పాఠ్యేతర చర్యలను కొన్నిటిని తీసుకొని, పాఠ్య విషయాలలోను, శాఖలలోను సర్దుబాట్లుచేయాలి. అధ్యయనం, విద్యా ప్రణాళికలను బాగుపర్చటం, బోధనా కార్యక్రమాలను మెరుగుపర్చటంకోసం ప్రత్యేక సంస్థలను నెలకొల్పాలి. పాఠ్య గ్రంథాలు, బోధనాపద్ధతులు ఆచరణ యుక్తమైన విధంగా వుండేటట్లుచూడాలి. తద్వారా శిక్షణపొందిన వారు మన జాతీయఆర్థిక వ్యవస్థలోని వివిధశాఖలకు పనికివచ్చే

టట్టుగా తయారుచేయాలి. ఉపాధ్యాయులకొరత, విద్యార్థులలో నైపుణ్యం సామర్థ్యం తగినంతగా లేకపోవటం — ఈ రెండూ ప్రస్తుతం ఉన్నత విద్యాస్థాయిని, ఉన్నత వృత్తి విద్యాస్థాయిని అభివృద్ధి చేయడంలో తీరని ప్రతిబంధకాలుగా వున్నాయి. అందుచేత మన విశ్వవిద్యాలయాలనుంచీ, కళాశాలలనుంచీ మెరికలైన పట్టభద్రులను ఎంచి, వారిని పరిశోధకులుగా తయారుచేయటం, ఇప్పటికీ మన పాఠ్యాలశాలలో లోపిస్తున్న విషయాలను అధ్యయనం చేసేందుకు విదేశాలకు పంపించటం చాలా అవసరం. ఆ విధంగా మన ఉపాధ్యాయుల సంఖ్యను పెంపొందించుకోవాలి. అదే సమయంలో సీనియర్, జూనియర్, మాధ్యమిక పాఠశాలలను తగినంతగా అభివృద్ధిచేసి, చక్కగా నిర్వహిస్తూ ఉండాలి. ఈ విధంగా మాధ్యమిక పాఠశాల విద్యార్థుల స్థాయిని పెంపొందించాలి. మన విశ్వవిద్యాలయాల్లో, కళాశాలల్లో, ఉన్నతవృత్తి విద్యాలయాల్లో పుస్తకాలు, ప్రయోగశాలల పరికరాలు మున్నగువాటి పరిస్థితి ఏమంత బాగాలేదు. ఈ లోపాన్నికూడా మనం క్రమంగా చక్కబరచుకోవాలి. అంతేకాక, యీ విద్యాసంస్థల అభివృద్ధి కవసరమైన భవనాలనుకూడా నిర్మించాలి.

నిర్మాణకృషికి నిపుణులను తయారుచేసుకొనే విషయంలో మనం విస్మరించరాని సంగతి మరొకటుంది. చురుకైన కార్మికులు, ఉద్యోగులు తీరికసమయాలలో ఉన్నతవిద్య నభ్యసించడానికి వీలుగా సాయంత్రం పాఠశాలలను, ఉత్తర ప్రత్యుత్తర విద్యాలయాలను ప్రారంభించాలి. ఈవిధంగా వారి స్థాయిని పెంపొందించాలి. ఈ రకం పాఠశాలల్లో వారు స్వచ్ఛందంగా చేరేటట్లు చూడాలి. వివిధ దశలలో, వివిధ గ్రూపులలో వారు విద్య నభ్యసిస్తూవుండాలి. తీరిక సమయాలలో విద్య నభ్యసించటానికి పూనుకొనే కార్మికులకు, ఉద్యోగులకు వారు పనిచేస్తున్న సంస్థల నిర్వాహణాధికారు లిందుకు తగువిధంగా అవకాశం కల్పిం

చాలి. అయితే, వారు పనిచేస్తున్న సంస్థలలో నిత్యం నిర్వహించ వలసిన పనిపాటలకు భంగకరమైన పద్ధతిలోగానీ, వారి ఆరోగ్యానికి హానికరమైన విధంగాగానీ తలకుమించిన బోధన చేయరాదు.

నిర్మాణకృషికి అవసరమైన శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానం గల కార్యకర్తలు మనకు తగినంతమంది లేరు గనుక, ఉన్నవారిని చాలా జాగ్రత్తగా మప్పితంగా వివిధశాఖలకు విభజించటం ఎంతో ముఖ్యం. అలాంటి కార్యకర్తలను వివిధశాఖలకు కేటాయించే టప్పుడు ఒక ముఖ్యమైన విషయాన్ని దృష్టిలో వుంచుకోవాలి: ఉత్పత్తి అవసరాలు, నిర్మాణ అవసరాలు, శాస్త్రీయ పరిశోధ నావసరాలు, బోధనావసరాలు – వీటన్నిటిని పరిగణనలోకి తీసు కొని, వీటిలో అత్యంత ముఖ్యమైనవాటికి ప్రథమస్థాన మొసగాలి. మిగతావాటికి కూడా తగినంత ప్రాధాన్యమీయాలి. శాస్త్రీయ సాంకేతిక పరిజ్ఞానంగల కార్యకర్తల పంపిణీలో యింతకుముందు జరిగిన పొరపాట్లను సరిదిద్దాలి; లోగడ సామర్థ్యాన్నిబట్టి కార్య కర్తలకు సరిగా పనులను పురమాయించియుండకపోతే, తక్షణం ఆ పని చేయాలి. సమర్థులైనవారిని ఎవరినీ వూరికే ఉండనివ్వరాదు.

(ఆ) శాస్త్రీయ పరిశోధనను పటుతరంచేసే సమస్య: ఈ మధ్య కేంద్ర కమిటీ, మంత్రి మండలి స్వయంగా పూనుకొని, దేశమంతటాగల ప్రముఖ శాస్త్రవేత్తలందరినీ సమావేశపర్చింది. అనేక వందలమంది శాస్త్రవేత్తలు ఆ సమావేశంలో పాల్గొన్నారు. దేశవ్యాప్తంగా శాస్త్రీయ, సాంకేతికాభివృద్ధిని సాధించటంకోసం సమగ్రమైన ద్వాదశ వర్ష ప్రణాళికను ఆ సమావేశంలో రూపొం దించారు. అలాగే తత్వశాస్త్ర, సామాజిక శాస్త్రాల అభివృద్ధికి సంబంధించిన మరొక ప్రణాళికనుకూడా తయారుచేశారు. ముఖ్యంగా ప్రకృతి, సామాజికశాస్త్రాలలో పరిశోధనాకృషియొక్క ఆవశ్యకతను నొక్కి వక్కాణించారు. మన శాస్త్రీయ పరిశోధనస్థాయి పెరగా లన్నా, రానున్న 12 సంవత్సరాలలోను మన దేశంలోని ముఖ్యమైన

శాస్త్రీయ, సాంకేతిక శాఖలు ప్రపంచంలోని మిగతా దేశాలస్థాయిని చేరుకోవాలన్నా ఈ రెండు ప్రణాళికలను అమలుజరపటం చాల ముఖ్యం. కేంద్ర కమిటీ, మంత్రిమండలి సారథ్యంక్రింద ఈ ప్రణాళిక లను సాధ్యమైనంత త్వరగా పూర్తిచేయాలి; అందుకు ఈ ప్రణాళికలో పేర్కొన్న కర్తవ్యాలను క్రమక్రమంగా నిర్వర్తించటానికి దేశంలో పరిశోధనాకృషిలో నిమగ్నులైవున్న శక్తులన్నింటినీ సమీకరించాలి. శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో మనం నిర్వహించవలసిన కర్తవ్యాలు ఎంతో కష్టతరమైనవి; పైగా, మనకు శాస్త్రపరిశోధ నలో నిపుణులైన వారు తగినంతగా లేరు. అదీకాక ఆధునికశాస్త్ర సాంకేతిక విజ్ఞానం శరవేగంతో పురోగమిస్తోంది. వీటన్నిటితో పాటు, యిప్పుడు మనం ఏ యే శాఖలకు అయితే అగ్రతాంబూలం యిస్తున్నామో ఆ శాఖలు ఈనాడు పేరుకుమాత్రమే ఉన్నాయి; కొన్ని పేరుకుకూడా లేవు. అందువల్ల మనం మొదట ముఖ్యమైన విషయాలపై దృష్టిని కేంద్రీకరించి పనిచేయాలి. అంతేకాని, అన్నిపనులూ ఒకేసారి ప్రారంభించాలన్న ధోరణిలో పడిపోయి, వున్న కార్యకర్తలను అన్నిరంగాలలో విచ్చలవిడిగా విరజిమ్మే వ్యవహారం జరగకూడదు.

శాస్త్ర పరిశోధనను పెంపొందించే నిమిత్తం, చైనా విజ్ఞాన పరిషత్‌లోను, ప్రభుత్వ శాఖలలోను, పారిశ్రామిక సంస్థల లోను మనం క్రమక్రమంగా శాస్త్రపరిశోధనా కేంద్రాలను చక్కని పునాదులపై నెలకొల్పాలి. అలాగే విశ్వవిద్యాలయాల్లోను, కళా శాలల్లోను శాస్త్రపరిశోధనాకృషిని పటుతర మొనరించాలి. అదే సమయంలో అన్నివైపులనుంచీ సాగుతున్న పరిశోధనాకృషిని చక్కగా సమన్వయపర్చాలి. ఆ సంస్థలన్నిటిమధ్య పని విభజన, సన్నిహిత సహకారం ఉండేటట్లు చూడాలి. సమ్యక్‌దృష్టితో శాస్త్రపరిశోధనా కేంద్రాలను వివిధ ప్రాంతాలలో నెలకొల్పాలి. దేశంలో జరుగుతున్న అనేకరకాల జాతీయ నిర్మాణకృషితో,

ముఖ్యంగా ఆర్థిక నిర్మాణకృషితో శాస్త్రపరిశోధనా కృషిని జోడించి సమన్వయపర్చాలి. "విభిన్న ఆలోచనా ధోరణులను పోటీపడనీయాలి". శాస్త్రీయ పరిశోధనకు సంబంధించినంతవరకు ఇదే సూత్రాన్ని మనం తూ. చ. పాటిస్తూ ఉండాలి. వివ్వత్ విషయాలపై స్వేచ్ఛగా చర్చలు జరపటానికి అవకాశం కల్పించాలి. తద్వారా శాస్త్రపరిశోధనాకృషిని కొనసాగిస్తూన్న వారందరి చొరవను, సృజనాత్మక శక్తిని వినియోగంలోకి తేవాలి.

తగినంత సాహిత్యాన్ని, వస్తుసముదాయాన్ని, పరికరాలను, ప్రయోగశాలలను సకాలంలో సమకూర్చుకోగలిగినపుడే శాస్త్ర పరిశోధనను పెంపొందించడం వీలవుతుంది. అలాగే శాస్త్ర పరి శోధనా కృషిలో నిమగ్నులైవున్న కార్యకర్తల పని పరిస్థితులను కూడా బాగుపర్చటానికి తీవ్రకృషి చేయాలి. శాస్త్ర విషయాలలో యింకా ఎక్కువగా విదేశాలతో సంబంధాలు పెట్టుకొని ఇతోధిక సహకారం సాధించాలి; విదేశాలనుంచీ, దేశంలో వివిధప్రాంతాల నుంచీ శాస్త్రీయ, సాంకేతిక సంబంధమైన భోగట్టాను సేకరించి మార్పిడి చేసుకొంటూవుండాలి.

## 10. ప్రజల జీవితస్థాయిని పెంపొందించే సమస్య

రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో అంతకంతకు అధిక మయే ఉత్పత్తి, జాతీయాదాయాల ప్రాతిపదికపై ప్రజల జీవన స్థితిగతులను యింకా అభివృద్ధిపర్చటం సాధ్యమే.

నిజానికి మనం సాగిస్తున్న నిర్మాణకృషి యావత్తూ సామాన్య ప్రజల శ్రేయస్సుకొరకే. అయితే ఆ కృషిని కొనసాగించే సందర్భంలో, ప్రజల దీర్ఘకాల ప్రయోజనాలను, తక్షణ ప్రయోజ నాలను సంతృప్తికరంగా సమన్వయపర్చటం ఏమంత తేలికైన విషయం కాదు. అందువల్ల, జాతీయాదాయాన్ని ఇటు ప్రోగు చేతకూ, అటు వినిమయానికీ మధ్య సరియైన నిష్పత్తిలో కేటా

యించటం చాల అవసరం. ప్రజల జీవన పరిస్థితులను క్రమంగా అభివృద్ధిచేస్తూనే, మరొకప్రక్క జాతీయ నిర్మాణకృషి కుంటు వడకుండా క్రమేణా విస్తరించేటట్లు చూస్తూ ఉండాలి.

ఈ సందర్భంలో క్రిందివిషయాలను గురించి ముఖ్యంగా ప్రస్తావిస్తాను :

(అ) కార్మికుల, ఉద్యోగుల జీవనపరిస్థితులను మెరుగుపర్చే సమస్య : రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో కార్మికుల, ఉద్యోగుల వేతనాలు సగటున నూటికి 25 నుంచి 30 వరకు పెరుగుతాయి. ఆర్థికాభివృద్ధియొక్క స్థాయికీ శ్రామికోత్పాదక వేగానికీ ఆ పెరుగుదల అనుగుణంగానే వుంటుంది. అనుభవం దృష్ట్యా, వేతనాల పెరుగుదల, శ్రామికోత్పాదనపెరుగుదల తగిన నిష్పత్తిలోవుండేటట్లు చూడాలి. ఈ విధంగా అంతకంతకు పెరిగే శ్రామికోత్పాదనతో పాటు కార్మికుల, ఉద్యోగుల వేతనాలనుకూడా పెంచాలి. పైగా కార్మికుల, ఉద్యోగుల వేతనాల పెంపుదలకు సంబంధించిన సాంవత్సరిక ప్రణాళికలను రూపొందించే సందర్భంలో ఉత్పత్తి అవకాశాలను, నిత్య జీవితావసర వస్తువుల సరఫరా అవకాశాలను కూడా దృష్టిలో పెట్టుకోవాలి. లేకపోతే వేతనాల పెరుగుదలకు, వాడకం వస్తువుల సరఫరాకు లంగ రందకుండా పోయే ప్రమాదం వుంటుంది. అలాంటి ప్రమాదాన్ని నివారించాలి.

కార్మికుల, ఉద్యోగుల స్థితిగతులను బాగుపర్చే నిమిత్తం వారి వేతనాలను పెంచటంతోపాటు, వారి నివాస స్థితిగతులను, భద్రత, వైద్య, ఆరోగ్య సౌకర్యాలను, తదితర శ్రేయోదాయక సౌకర్యాలను మెరుగుపర్చాలి; అందుకు యిపుడూ, రెండో పంచవర్ష ప్రణాళికలోనూ క్రమంగాకొన్ని చర్యలు అమలుజరపాలి. ఈ విషయంలో మంత్రిమండలి నిర్దిష్టమైన కొన్నిచర్యలను అమలు జరపాలని నిర్ణయించింది; ఆ చర్యలేమిటో త్వరలోనే ప్రకటిస్తాం. అద్యతనభావిలో అవి ఆచరణలోకి వచ్చేటట్టు చూస్తాం.

కార్మికుల, ఉద్యోగుల జీవితంపట్ల నిర్లక్ష్యభావంతో నిరంకుశవైఖరిని అవలంబించేవారికి వ్యతిరేకంగా మనం ఇకముందు కూడా పోరాటాన్ని కొనసాగించాలి. కార్మికుల, ఉద్యోగుల శ్రేయస్సుకోసం జరగవలసిన పనులు ఇంతవరకు తగినంతగా జరగలేదంటే అందుకు కేవలం ఆర్థిక, భౌతిక ఉసులుబాటులు లోపించటమే పూర్తికారణం అని చెప్పేందుకుపీలులేదు. ప్రభుత్వ ధనాన్ని అదనంగా వ్యయపర్చవలసిన అవసరం లేకుండానే, కొన్ని శ్రేయోదాయక సౌకర్యాలు కల్గించటానికి అవకాశంవుంది. అయితే నిరంకుశ పద్ధతులలో పనిచేసేతీరుకు మనం స్వస్తిచెప్పాలి. ప్రజల జీవితాలకు సంబంధించిన మంచిచెడ్డలను సదా చూస్తూ ఉండాలి. ప్రణాళికను అమలుజరపటానికి దీక్షతో పనిచేయాలి. ప్రణాళికకు సంబంధించిన ప్రభుత్వ నిబంధనలను తు.చ. పాటిస్తుండాలి. ఇవన్నీ చేస్తే కార్మికుల, ఉద్యోగుల జీవన పరిస్థితులను గణనీయంగా మెరుగుపర్చటం ప్రస్తుత పరిస్థితులలోకూడా సాధ్యమే.

(ఆ) రైతుల స్థితిగతులను బాగుపర్చే సమస్య : రైతుల జీవనపరిస్థితులను మెరుగుపర్చే విషయం ఆలోచించేటప్పుడు మనం ఒక సంగతి గుర్తుంచుకోవాలి. ప్రభుత్వ నిధుల పెంపుదలకూ, సహకారసంస్థల ఆదాయానికీ మధ్య సరియైన నిష్పత్తిని సాధించాలి. ప్రభుత్వ ఆదాయాన్ని పెంపొందించుటలో రైతుల వాటా ఎంతో సరిగా నిర్ణయించాలి. అలాగే సహకార సంస్థల ఆదాయంలో ఎంత భాగాన్ని సహకారసంస్థల నిధులకు జమకట్టాలి; ఎంత భాగాన్ని సహకారసభ్యులకు పంపిణీచేయాలి అన్న సమస్యనుకూడా సక్రమంగా పరిష్కరించాలి. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో, ప్రభుత్వ ఆదాయంలో వ్యవసాయ పన్నువాటా సక్రమమైన నిష్పత్తిలో వుండాలి. మామూలు వ్యవసాయపన్నును, అదనపు పన్నులను సమ్మేళనంచేసి, పన్ను విధింపు విధానాన్ని సులభతరంచేయాలి. అదే సమయంలో

వ్యవసాయ సహకార సంస్థలన్నీ "ఉన్నత వ్యవసాయ సహకార సంస్థలు పాటించవలసిన నిబంధనలకు" తు. చ. తప్పకుండా కట్టుబడి ప్రవర్తించాలి. ఈ విధంగా, ఆ నిబంధనలలో రూపొందించిన పరిమితులను అతిక్రమించి రిజర్వు నిధులకుగానీ, శ్రేయోదాయక నిధులకుగానీ, పరిపాలనా వ్యయానికిగానీ హెచ్చు మొత్తాలు కేటాయించకుండా చూడాలి. ఇలాచేస్తే, అనుకొన్నట్టు రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో వ్యవసాయోత్పత్తి పెరుగుదలను సాధిస్తే, ఈ అయిదు సంవత్సరాలలోను రైతుల ఆదాయం నూటికి 25 నుండి 30 వంతులవరకు పెరగటానికి పూర్తి అవకాశం వుంది.

రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో, వ్యవసాయ సహకార సంస్థల ఉత్పత్తి పెంపుదలకు ప్రభుత్వం సర్వవిధాల సహాయపడుతూవుంటుంది. మొదటి ప్రణాళిక కాలంలో ఖర్చుపెట్టిన మొత్తంకంటె చాల హెచ్చు మొత్తాలు నీటిపారుదల వసరులకు రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రభుత్వం ఖర్చుపెడుతుంది. అలాగే వ్యవసాయ రుణాలను ఎక్కువచేస్తుంది. అదేసమయంలో ప్రకృతి ఉపద్రవాలకు గురియైన ప్రాంతాలకు సహాయంచేసే నిమిత్తం ప్రత్యేక నిధులను కేటాయిస్తుంది. పర్వతమయంగావుండే ప్రాంతాలలో జీవనాధారానికి అంత అనుకూలమైన పరిస్థితులు సహజంగా లభ్యంకావు. పైగా అలాంటి ప్రాంతాలన్నీ కూడా పూర్వం విప్లవస్థావరాలుగా వుండేవి. కనుక ఆ ప్రాంతాలలో నివసిస్తున్న ప్రజల జీవన స్థితిగతులను పెంపొందించటానికి, ఉత్పత్తిని ఇతోధికం చేయటానికి ప్రభుత్వం ప్రత్యేకంగా సహాయం చేస్తుంది.

(ఇ) ప్రజల సాంస్కృతికస్థాయిని పెంపొందించే సమస్య: రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో ఆర్థిక నిర్మాణాభివృద్ధిని సాధించటంతోపాటు, ప్రజల సాంస్కృతికావసరాలను ఇతోధికంగా తీర్చుతూండటంతోపాటు, ప్రణాళికలో పేర్కొన్నవిధంగా

నిరక్షరాస్యతను నిర్మూలించటానికి, ప్రాథమికవిద్యను పెంపొందించటానికి, తీరిక సమయాలలో కార్మిక కర్షకులు విద్య నభ్యసించే అవకాశాలు కల్పించటానికి చైనాభాషలో లిపి సంస్కరణను క్రమ క్రమంగా సాధించటానికి కృషిచేయాలి. అదే సమయంలో ప్రజలలో సాంస్కృతిక కృషినీ, పత్రికలు, గ్రంథ ప్రచురణ, ప్రసార, సాహిత్య, కళా, సినిమారంగాలలో కృషినీ విస్తరింప చేయాలి. ఈ రంగాలలో కృషి సాగించేటప్పుడు గుణాత్మకమైన అభివృద్ధిని సాధించాలన్న విషయాన్ని ముఖ్యంగా గుర్తుంచుకోవాలి.

ప్రజాసామాన్యంలో మనం సాంస్కృతిక, విద్యాకృషిని క్రమబద్ధంగాను, పట్టుదలతోను కొనసాగించాలి. నిరక్ష్యరాస్యతను నిర్మూలించే విషయంలోను, ప్రాథమిక విద్యను పెంపొందించే విషయంలోను, సాంఘిక, సాంస్కృతిక, ప్రచురణ కృషి విషయంలోను మనం గత కొలది సంవత్సరాలుగా అనేక తప్పులు చేస్తూ వచ్చాం. అయితే, యథాస్థితి మనస్తత్వంతోనో, ముందు వెనుకలు ఆలోచించకుండా ఆదరాబాదరాగా ముందుకు పోయే ధోరణితోనో ప్రవర్తించాం. దాని ఫలితంగా ఎంతో హాని వాటిల్లింది. దీనిని గుణపాఠంగా తీసుకొని, ఉత్తరోత్తరా మనం వాస్తవమైన అవసరాలకు, అవకాశాలకు అనుగుణంగా, ఆచరణయుక్తమైన పద్ధతిలో కృషిచేయాలి.

ప్రజలలో సాంస్కృతిక, విద్యా కృషిని కొనసాగించేటప్పుడు మనం పూర్తిగా ప్రజలపైన, ప్రజాసాన్నిహిత్య పంథా (మాస్ లైన్) పైన ఆధారపడాలి. అన్ని విషయాలలోను తానే తలదూర్చి, తన అభిమతాలనే ప్రజలపై రుద్దే తప్పులు అనేకం గతంలో జరిగాయి. ఇకముందు అలాంటి తప్పిదాలు జరగకుండా చూడాలి. ప్రజల యిష్టాయిష్టాలను పాటించాలన్న సూత్రాన్ని అతిక్రమించరాదు. ఎప్పటికప్పుడు ప్రజలను సంప్రతించుతూఉండాలి. పోతే,

నిజంగా ప్రజల అవసరాలను తీర్చేటట్టి, ప్రజలే స్వయంగా నిర్వహించవలసిన తీరిక సమయాల క్లాసులు, సాహిత్య క్లాసులు, క్లబ్‌లు, నాటక దళాలు మున్నగువాటిని బలపర్చాలి; వాటిపై మన నాయకత్వాన్ని పటుతరం చేయాలి. అయితే, ప్రజల సమయాన్నీ, శక్తినీ పొదుపుచేయటానికి ప్రయత్నించాలి; ఇష్ట మొచ్చినట్లు ప్రజలపై లేనిపోని భారం వేయరాదు.

(ఈ) ప్రజల ఆరోగ్యాన్ని పెంపొందించే సమస్య : రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో, ప్రజారోగ్య సౌకర్యాలను, వైద్య సౌకర్యాలను అభివృద్ధిచేయటానికి మనం మన కృషిని కొనసాగించాలి. వ్యాయామశాస్త్రాన్ని, క్రీడారంగాన్ని అభివృద్ధిపర్చాలి. కుటుంబ నియంత్రణను తగువిధంగా పెంపొందించాలి.

గత కొలది సంవత్సరాలలోను పారిశుధ్యంకొరకు సాగించబడిన దేశభక్తియుతమైన ఉద్యమం ఎన్నో సత్ఫలితాలను సాధించింది. పరిసరాల పరిశుభ్రత హెచ్చింది. తత్పర్యవసానంగా రోగాలు తగ్గిపోయాయి. అయితే నిరుడూ, ముందటేడూమాత్రం ఈ ఉద్యమాన్ని మనం కొద్దిగా అలక్ష్యం చేశాం. అందువల్ల పారిశుధ్య ఉద్యమాన్ని ఇకముందుకూడా నిరంతరం కొనసాగిస్తూ ఉండాలి. అలా ఆ ఉద్యమాన్ని కొనసాగించినప్పుడే పట్టణాలలోను, గ్రామీణ ప్రాంతాలలోను పరిసరాల పారిశుధ్యం మెరుగవుతుంది; అంటురోగాలు, దీర్ఘకాలరోగాలు తగ్గిపోతాయి. అదేసమయంలో సిస్టోసోమియాసిస్ జబ్బును అరికట్టటంలో మనం సంపాదించిన అనుభవాలను ప్రజలలో విరివిగా ప్రచారంచేయాలి. స్థానికప్రాంతాలలో వుండే ప్రమాదకరమైన రోగాలను క్రమబద్ధంగా, దళాలవారీగా, జిల్లాలవారీగా రూపుమాపాలి. దేశమందంతటా నగరాలలోను, గ్రామాలలోను వుండే ప్రాథమిక వైద్యశాలలు రోగాలను నివారించటంలోను, నయంచేయటంలోను ప్రముఖపాత్ర నిర్వహించాయి. అందువల్ల యికముందు ఆ వైద్యశాలల విషయంలో

ప్రజారోగ్యశాఖలు తమ నాయకత్వాన్ని పటుతర మొనర్చు కోవాలి.

మన ప్రజారోగ్య, వైద్యశాఖలలో యింకా అనేక లోపా లున్నాయి. ఉదాహరణకు మన ఆసుపత్రులనే తీసుకొందాం. వాటి నిర్వహణ బొత్తిగా బాగా లేదు. ఆసుపత్రులకు చెల్లించుకో వలసిన రుసుం చాలా హెచ్చుగా వున్నందువల్ల, అనేకమంది రోగులు ఆసుపత్రులలో చేరలేకపోతున్నారు; వైద్య సౌకర్యం పొందలేకపోతున్నారు. పైగా ఆసుపత్రులలో ప్రస్తుతమున్న మంచాలు పూర్తిగా వినియోగంలోకి రాకుండాపోతున్నాయి. అలాగే ఉచిత వైద్యసౌకర్యాల విషయంలోను, వైద్య కృషి సాగు తున్న పద్ధతుల విషయంలోను లోపాలున్నాయి. ఈ లోపా లన్నిం టినీ తొలగించుకొనే నిమిత్తం, ప్రజారోగ్యశాఖలు విచారణ జరిపించాలి; గట్టి పట్టుదలతో పరిస్థితులను ఆమూలాగ్రంగా పరిశీలించి, స్థితిగతులను బాగుపర్చటానికి ఆచరణరీత్యా అనువైన పద్ధతులను రూపొందించాలి.

మనం వ్యాయామశిక్షణయొక్క ఆవశ్యకతను గురించి ప్రజ లలో ప్రచారంచేయాలి. ప్రజల శారీరక దారుఢ్యాన్ని పెంపొంచ టానికి గట్టికృషి చేయాలి. క్రీడారంగంలో ప్రస్తుతస్థాయిని పెంపొం దించాలి. ఈ సందర్భంలో మనం ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఆ యా పరిస్థితులనుబట్టి, ఆ యా వ్యక్తుల శారీరక స్థితినిబట్టి క్రమ క్రమంగా శిక్షణ గరపుతూఉండాలి. అంతేకాని, తక్షణం గొప్ప గొప్ప ఫలితాలు సాధించాలని తలకుమించిన శిక్షణ యివ్వ కూడదు. పిడుక్కీ, బియ్యానికీ ఒకేమంత్రం అన్న పద్ధతిలో వ్యవహ రించరాదు.

స్త్రీల ఆరోగ్యాన్ని, పిల్లల ఆరోగ్యాన్ని కాపాడటంకోసం, యువతరంవారిని చక్కగా సాకుతూ, విద్యాబుద్ధులు గరిపేందుకు వీలుగా కుటుంబ నియంత్రణను తగుమాత్రంగా అమలుజరపటం

అభిలషణీయమని మనం అంగీకరిస్తాం. అందుకోసం ఆరోగ్యశాఖ యితర శాఖల సహకారంతో, నేర్పరితనంతో ప్రచారంచేస్తూ, గట్టిచర్యలు తీసుకోవాలి.

## 11. సామాజిక పొదుపరితనం కొనసాగించే సమస్య

కష్టపడి పనిచేయటం, పొదుపరితనం ఈ రెండు సత్సాంప్రదాయాలు మన ప్రజల సొత్తు. అన్ని ప్రభుత్వ సంస్థలు, ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలు, పబ్లిక్ సంస్థలు, సహకార సంస్థలు మానవ శక్తినీ, సాధన సంపత్తినీ, ధనాన్నీ అత్యంత మప్పితంగా వాడే పద్ధతులను అనుసరించాలి. తద్వారా మన దేశంలో సోషలిస్టు నిర్మాణాన్ని పెద్ద ఎత్తున సాగించటానికి తోడ్పడాలి.

సంవత్సరం క్రిందట సమావేశమైన పార్టీ కేంద్ర కమిటీ, మంత్రిమండలి ప్రభుత్వోద్యోగులకు, దేశంలోని యావన్మంది ప్రజలకు పొదుపరితనం అమలుజరిపి, దుబారా జరగకుండా చూడాలని పిలుపు యిచ్చాయి. ఈ క్రిందివాటికి తక్షణం స్వస్తిచెప్పాలని ఆదేశించాయి: ఉత్పత్తికి ఉపకరించే ప్రాజెక్టులను మితం లేకుండా నిర్మించే పద్ధతికి స్వస్తిచెప్పాలి. ఉత్పత్తికి ఉపకరించే ప్రాజెక్టులకు హద్దూపద్దూ లేకుండా పెద్దమొత్తాలు వ్యయంచేసే పద్ధతి మానాలి; ఇంజనీరింగ్ కృషిని, పారిశ్రామిక సరుకుల నాణ్యాన్ని పెంచాలి. వివిధ సంస్థలలో అవసరానికి మించిన జనాన్ని నియమించరాదు. ప్రభుత్వానికి చెందిన వస్తువులు దుబారా కాకుండాను, పోకుండాను చూడాలి. ఈ విషయాలలో గతసంవత్సరం సాగించిన కృషిఫలితంగా పరిస్థితులు కొంత బాగుపడ్డాయి. అయినప్పటికీ అన్ని ప్రభుత్వశాఖలు ఇంకా పొదుపరితనం పూర్తిగా పాటించటంలేదు; దుబారా జరుగుతున్న ఉదంతాలు యింకా వుండనే వున్నాయి. అంతేకాక, పొదుపరితనం పాటించే పేరుతోను, సంస్కరణ వాదభావాలను వ్యతిరేకించే పేరుతోను తప్పుడు ధోరణి ఒకటి తలెత్తింది. ఆ ధోరణిగలవారు కేవలం రాశికి,

వేగానికి మాత్రమే ఎక్కువ ప్రాధాన్యమిస్తున్నారు. తత్ఫలితంగా నాణ్యం దెబ్బతింటోంది. ధనం దుబారా అవుతోంది. అలాంటి ధోరణితో నిర్మించబడిన కొన్ని ఇంజనీరింగ్ ప్రాజెక్టులు, ఉత్పత్తి చేయబడిన పారిశ్రామిక సరుకులు ఎందుకూ పనికిరాకుండా పోయాయి. వాటిలో కొన్నింటిని తిరిగి నిర్మించుకోవడమో, లేదా తయారుచేసుకోవడమో చేయవలసివచ్చింది. అందువల్ల పొదుపరితనం జరగకపోగా, దుబారా జరిగింది.

రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో జాతీయ నిర్మాణం పెద్దఎత్తున కొనసాగుతుంది కనుక, సరుకుల సరఫరా విషయం లోను, నిధుల విషయంలోను, సాంకేతిక నిపుణుల విషయంలోను ఎన్నో యిబ్బందులు ఎదురుకాకమానవు. కనుక మనకున్న సాధన సంపత్తిని, మానవశక్తిని, ధనాన్ని మప్పితంగా వాడుకొంటేనే, ఆ యిబ్బందులను సునాయాసంగా అధిగమించగలం. ప్రణాళికా రచన ఎంత బాగావుంటే పొదుపరితనాన్ని అంతబాగా అమలు జరపవచ్చు. అలాగే ప్రణాళికా రచన ఎంత చెడుగావుంటే దుబారా అంత ఎక్కువగా వుంటుంది. అందువల్ల వివిధస్థాయిల లో గల ప్రభుత్వసంస్థలు ప్రణాళికలను వేసుకోటంలో అతి జాగ్రత్తగా వ్యవహరించాలి. పారిశ్రామిక సంస్థలన్నింటిలోను సాంకేతిక సంబంధమైన తనిఖీని కట్టుదిట్టంగా సాగిస్తూఉండటానికి పాతపద్ధతులను విడనాడి, ఆధునికమైన చక్కని పద్ధతులు అవలంబించాలి. సాంకేతిక సంబంధమైన కంట్రోలును పటుతరం చేయాలి. పారిశ్రామిక సరుకుల నాణ్యాన్ని, ఇంజనీరింగ్ ప్రాజెక్టుల నాణ్యాన్ని మెరుగుపర్చాలి. తద్వారా యెందుకూ పనికిరాని తక్కువరకం సరుకులు ఉత్పత్తికాకుండా చూడాలి. అలాగే ఇంజనీరింగ్ ప్రాజెక్టులనాణ్యం పెంపొందిస్తూ,తద్వారా ప్రమాదాలు జరగకుండా అరికట్టాలి. వ్యక్తిగత బాధ్యతా పద్ధతిని తు. చ. తప్పకుండా అమలుజరపాలి. దేనికి ఎవరు బాధ్యులోకూడా

తెలియని అనిర్దిష్ట పరిస్థితికి స్వస్తిచెప్పాలి. దుబారా జరగకుండా చూస్తూ, పొదుపరితనం అమలుజరపాలంటే, పైన పేర్కొన్న పనులన్నింటినీ చేయాలి. పబ్లిక్ సంస్థలన్నీకూడా అనవసరమైన ఖర్చులను, ఉద్యోగులను తగ్గించివేయాలి. ఆర్థికవ్యవహారాలు, ఆడిటింగ్ పక్కాగా వుండేటట్లు చేయాలి. "కష్టపడుట, పొదుపరితనం" అనే సూత్రాన్ని సహకార సంస్థలన్నీ తప్పకుండా పాటిస్తూ ఉండాలి.

ప్రభుత్వ పరిపాలనా సంస్థలలో దండుగమారివాటిని తగ్గించివేయాలి. అనవసరమైన ఉద్యోగులను తగ్గించాలి. మొత్తంమీద చెప్పాలంటే, యీనాడు వివిధస్థాయిలలో గల ప్రభుత్వ పరిపాలనా సంస్థ లన్నింటిలోను ఉద్యోగులు అవసరానికి మించిన సంఖ్యలో వున్నారు. క్రింది పరిపాలనా సంస్థలలోకన్న పైవాటిలో అవసరం లేని ఉద్యోగులు ఎక్కువగా వున్నారు. అందువల్ల పరిపాలనా సంస్థల ఉద్యోగులను పైనుంచి క్రిందిదాకా మనం పునర్వ్యవస్థీకరించాలి. పై శాఖలలో వున్న ఉద్యోగులను క్రిందిశాఖలలోనికి, ఉత్పత్తికి ఉపకరించని శాఖలలో పనిచేస్తున్నవారిలో కొందరిని ఉత్పత్తికి ఉపకరించే శాఖలలోకి మార్చాలి.

ప్రభుత్వ సంస్థలలో పొదుపరితనం అమలుజరపటానికి తీసుకోవలసిన సమర్థవంతమైన చర్యలు యివే.

## 12. సోవియట్ యూనియన్‌తోనూ, నూతన ప్రజాతంత్రి దేశాలతోనూ ఐక్యతను, సహకారాన్ని పటుతరమొనర్చుతూ, దేశదేశాలమధ్య ఆర్థిక, సాంకేతిక, సాంస్కృతిక సహకారాన్ని పెంపొందించే సమస్య.

సోషలిస్టు నిర్మాణాన్ని జయప్రదంగా పూర్తి చేసే నిమిత్తం, మనం దేశంలోని నిర్మాణాత్మకశక్తులన్నింటినీ సమీకరించటంతో పాటు, అంతర్జాతీయంగా మనకుగల అనుకూల వాతావరణాన్ని

కూడా వినియోగించుకొనేందుకు అంతర్జాతీయశక్తు లన్నింటినీ సమీకరించాలి. సోవియట్‌యూనియన్‌తోను, నూతన ప్రజాతంత్ర దేశాలతోను మన ఐక్యతను పటుతరంచేస్తూ, సంపూర్ణమైన సమన్వయాన్ని, పరస్పర సహకారాన్ని సాధించటంకోసం మనం అచంచలంగా కృషిచేస్తున్నాం. విభిన్న సామాజిక వ్యవస్థలను కలిగియున్న దేశాలతో, ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా దేశాలతో ఆర్థిక సహకారాన్ని, వాణిజ్యసంబంధాలను, సాంస్కృతిక, సాంకేతిక సంబంధాలను పెంపొందించుకోటానికికూడా మనం శక్తి వంచన లేకుండా కృషిసాగిస్తున్నాం.

చైనాకూ, సోవియట్ యూనియన్, నూతన ప్రజాతంత్ర దేశాలకూ మధ్య కొనసాగుతున్న పరస్పర సహాయ సహకారాలకు అభేద్యమైన, సౌహార్దపూరితమైన మిత్రత్వం పునాదిగా వుంది. సోషలిస్టుదేశా లన్నింటా ఆర్థికాభివృద్ధిని సాధించి, ప్రజల జీవన స్థితిగతులను మెరుగుపర్చి, వారి సాంస్కృతిక స్థాయిని పెంపొందించాలన్న పరమాశయంతో ఆ పరస్పర సహాయ సహకారాలు కొనసాగుతున్నాయి.

ఇంతకుముందే వివరించినట్లు, మన జాతీయ ఆర్థిక వ్యవస్థ యొక్క పునరుజ్జీవన దశలోను, మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలోను సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాలు మనకు సర్వతోముఖమైన, అపారమైన సహాయాన్ని నిస్వార్థదృష్టితో చేశాయి. ఆ దేశాలు చేసిన సహాయంవల్ల మనం అనేక కష్టాలను అధిగమించగలిగాం; చాలా కొద్దికాలంలో సోష లిస్టు నిర్మాణాన్ని త్వరితంగా పెద్దయెత్తున కొనసాగించగలిగాం. రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో కూడా సోవియట్ యూని యన్, నూతన ప్రజాతంత్ర దేశాలు మన దేశానికి పెద్దయెత్తున సౌహార్దపూర్వక సహాయం చేయనున్నాయి. ముఖ్యంగా, పెద్ద పెద్ద పథకాలను ఆ దేశాల సహాయంతోనే మనం స్థాపించుకో

గల్గుతున్నాం. మన దేశంలో సోషలిస్టు పారిశ్రామికీకరణను అమలు జరపటంలో ఆ భారీ పరిశ్రమలు నిర్వహించే పాత్ర ప్రముఖమైనదిగా వుంటుంది. నిర్మాణరంగంలోను, శాస్త్రీయ సాంకేతిక రంగాలలోను సోవియట్ యూనియన్, నూతన ప్రజాతంత్ర దేశాలు సాధించిన ఆధునికమైన అనుభవం మనకు యింతకుముందు ఎంతగానో ఉపయోగపడింది; ఇకముందుకూడా ఆ దేశాలనుంచి మనం అనేక విషయాలను నేర్చుకుంటూ వుంటాం.

సోషలిస్టు శిబిరంలో సభ్యత్వదేశంగా వున్న చైనా కూడా తన విధ్యుక్తధర్మాన్ని సక్రమంగా నెరవేర్చాలి. సోదర దేశాల నిర్మాణ కృషికి అవసరమైన వ్యవసాయ సరుకులను, పశుజాతుల వల్ల లభించే సరుకులను, కొన్ని రకాల యంత్రాలను, పారిశ్రామిక సరుకులను సరఫరా చేయటం మనవిధి. ఆ వస్తువుల సరఫరా సక్రమంగా జరిగేటట్లు చూసేందుకు వాటి ఉత్పత్తిని పెంచాలి; లేదా కొంతవరకు మన వినియోగాన్ని తగ్గించుకోవాలి. అదే సమయంలో సరిసమానత్వం, పరస్పర శ్రేయస్సు అనే ప్రాతిపదికపై విదేశాలతో మనం సాగిస్తున్న వాణిజ్యం కొరకు, ఎగుమతులు నిరాఘాటంగా సాగేందుకు వీలుగా దేశంలో ఉత్పత్తి వినిమయాలకు చక్కని ప్రణాళిక రూపొందించు కోవాలి.

గత కొలది సంవత్సరాలలోను అనేక ఆసియా, ఆఫ్రికా దేశాలతో ఆర్థిక, సాంస్కృతిక, సాంకేతిక సంబంధమైన సహకార సంబంధాలను నెలకొల్పుకొన్నాం. ఆ సంబంధాలు అంతకంతకు సన్నిహితం అవుతున్నాయి. బాండుంగ్‌లో జరిగిన ఆసియా, ఆఫ్రికా దేశాల మహాసభ అనంతరం ఆ సహకార సంబంధాలు మరింత విస్తృతమయ్యాయి. ఆసియా, ఆఫ్రికా దేశాలలో అత్యధిక దేశాలు వలసపాలన ఫలితంగా తమకు దాపురించిన ఆర్థిక, సాంస్కృతిక దళిత స్థితినుంచి త్వరగా బయటపడాలని తహతహ లాడుతున్నాయి. అందువల్ల ఆ దేశాలు తమలో తాము

ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో పరస్పరం సహకరించు కోవాలని గాఢంగా వాంఛిస్తున్నాయి. సరిసమానత్వం, పరస్పర శ్రేయస్సు అనే ప్రాతిపదికపైన, ఎలాంటి షరతులూ లేకుండా, ఆసియా ఆఫ్రికా దేశాలు ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో పరస్పరం సహకరించుకోవాలనే మొదటినుంచీ మనం చెబుతూ వచ్చాం. అలా సహకరించుకొన్నందువల్ల ప్రతిదేశం ఆర్థికంగాను, సాంస్కృతికంగాను, స్వేచ్ఛాభివృద్ధిని పొందటానికి సహాయకారి కాగలదని స్పష్టంచేశాం. ఆసియా, ఆఫ్రికా దేశాలు ఒకదేశంనుంచి మరొకదేశం నేర్చుకోవాలని సూచించాం. ఇలాంటి సహకారం నెరపుకొన్నందువల్ల ఆసియా, ఆఫ్రికా దేశాల జాతీయ స్వాతంత్ర్యానికి భద్రత ఏర్పడుతుంది. శాంతిమండలం విస్తరిస్తుంది. అది మన జాతీయ నిర్మాణ కృషికి కూడా తోడ్పడుతుంది. ప్రస్తుతం ఇలాంటి సహకారానికి అవకాశాలు ఇంకా ఎక్కువగా అభివృద్ధి చెందలేదు. అయితే ముఖ్యమైన విషయం ఏమిటంటే, ఆసియా ఆఫ్రికా దేశాలు తమలో తాము సహకరించుకోటానికి ఉపక్రమించాయి; అవి లాటిన్ అమెరికా దేశాలతోకూడా సంబంధాలు పెట్టుకొంటున్నాయి. ఉత్తరోత్తరా అలాంటి సహకారానికి, సంబంధాలకు అపారమైన అవకాశం కల దనిమాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చు.

సరిసమానత్వం, పరస్పర శ్రేయస్సు అనే ప్రాతిపదికపై ప్రపంచంలోని మిగతా దేశాలన్నింటితోను కూడా ఆర్థిక, సాంస్కృతిక, సాంకేతిక సంబంధాలను పెంపొందించుకోడానికి మనం సిద్ధంగావున్నాం. పశ్చిమదేశాలతో మన వాణిజ్యాన్ని యితోధికం చేయటానికి మనం శక్తివంచనలేకుండా కృషిచేశాం. పశ్చిమదేశాలు శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో గడించిన అనుభవాన్ని స్వీకరించటానికి మనం సిద్ధంగావున్నాం. మనపైన అమెరికా ఆర్థికదిగ్బంధనాన్ని అమలుజరుపుతోంది; అమెరికా ఒత్తిడిమూలాన అనేకదేశాలు విధిలేక ఆర్థిక ఆంక్షలు అమలు

జరుపుతున్నాయి. అమెరికా అనుసరిస్తున్న విధానం అన్ని దేశాల లోని ప్రజల ప్రయోజనాలకు పూర్తిగా విరుద్ధమైనది; అందువల్ల ఆర్థిక దిగ్బంధన కార్యక్రమానికి అన్నివైపులనుంచీ ప్రతిఘటన ఆనాటికానాడు అధికతరమవుతోంది. నిర్హేతుకమైన, కృతకమైన ఈ అడ్డుగోడలు ఇవాళ కాకపోతే రేపైనా కూలిపోక మానవు.

ఆర్థిక, సాంకేతిక, సాంస్కృతిక రంగాలలో వివిధ దేశాల మధ్య సహకారం పెంపొందినందువల్ల మన సోషలిస్టు నిర్మాణం నిరాటంకంగా త్వరితగతిని కొనసాగటం మాత్రమేకాక, వివిధ దేశాలు శాంతియుత వాతావరణంలో సహజీవనం నెరపుకోటానికి అది పదిలమైన పునాదిగాకూడ ఉపకరిస్తుంది. కనుకనే అలాంటి సహకారం వాంఛనీయమని మనం అంటున్నాం. అందుచేత మనం సూచిస్తున్న మార్గం ప్రపంచప్రజలందరి ప్రయోజనాలకు, శాంతి ప్రయోజనాలకు పూర్తిగా అనుగుణ్యమైనది.

కామ్రేడ్స్! మొదటి పంచవర్ష ప్రణాళిక ~~ప్రారంభ~~ జయప్రదమయ్యే మంచిరోజు ఎంతో దూరాన లేదు. వచ్చేసంవత్సరంలోను, ఆపైన పార్టీసభ్యులందరూ కేంద్రకమిటీ నాయకత్వాన, కామ్రేడ్ మావో సే-టుంగ్ సారథ్యంక్రింద, కార్మికులు, కర్షకులు, మేధావులు, వివిధ జాతులప్రజలు, రాజకీయపక్షాలు దేశభక్తి ప్రజానీకం అందరితోనూ కలిసి, తమకృషిని యింతోధికం చేయాలి; మొదటి పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను అధిగమించాలి; రెండవ ప్రణాళికకు క్రియాత్మకమైన సన్నాహాలు సాగించాలి. మనం కనుక నమ్రతతోను, వివేచనతోను మెలగుతూ, ఆహంభావానికి, తొందరపాటుకు లోనుకాకుండా, స్వీయమానసిక పోకడలను, నిరంకుశ పనిపద్ధతులను సరిదిద్దుకోగల్గితే, వివిధ రకాలైన యిబ్బందులను అధిగమించటానికి సర్వశక్తులను సమీకరించగలం. మన దేశాన్ని సోషలిస్టు మహాదేశంగా, పారిశ్రామిక దేశంగా అభివృద్ధిచేయటానికి సాగించే జైత్రయాత్రలో ముందుకు సాగగలం.



# గమనిక

86 వ పేజీ 14 వ పంక్తిలో "మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభమయ్యే" అను మాటలకు బదులు "మొదటి పంచవర్ష ప్రణాళిక జయప్రదమయే" అను మాటలను చేర్చుకొన ప్రార్థన.

## చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభ

# లీ షావ్ - చీ నివేదిక

1956 సెప్టెంబరు 3 వ వారంలో జరిగిన చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభకు కేంద్ర కమిటీ తరఫున లీ షావ్ - చీ సమర్పించిన రాజకీయ నివేదిక, అన్ని దేశాల కమ్యూనిస్టులు తప్పక అధ్యయనం చేయవలసిన సిద్ధాంత గ్రంథం.

చైనా కమ్యూనిస్టుపార్టీ అగ్రనాయకుల్లో ఒకరైన లీ షావ్ - చీ, సోషలిస్టు సమాజాన్ని నిర్మించేందుకు చైనా కమ్యూనిస్టుపార్టీ వివిధదశల్లో అనుసరిస్తూవచ్చిన, అనుసరించబోతున్న విధానం యీ నివేదికలో సాంగోపాంగంగా వివరింపబడింది. వివిధవర్గాలపట్ల చైనా కమ్యూనిస్టుపార్టీ అవలంబిస్తున్న వైఖరి, ఐక్యసంఘటనను నిర్మించటంలో అది చేపట్టిన పద్ధతులు, సోషలిస్టు నిర్మాణంలో కొందరు పార్టీ సభ్యుల పెడమార్గాలను సరిదిద్దడానికి చేసిన సూచనలు, పార్టీ నిర్మాణంలో తెలయెత్తిన కొన్ని వక్రధోరణులను సరిదిద్దడానికి నిబంధనావళిలో చేయబడ్డ మార్పులు—మొదలైన విషయాలను లీ షావ్ - చీ యీ నివేదికలో చర్చించారు. ప్రతి కమ్యూనిస్టు తప్పకుండా చదవవలసిన అమూల్యగ్రంథం.

పేజీలు : 162; వెల : 1-0-0.

ప్రతులకు :

**విశాలాంధ్ర ప్రచురణాలయం,**

విజయవాడ - 2.

స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్సు, విజయవాడ-2.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA102B196 |
| పుస్తకం పేరు | చైనా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక చౌఎన్ లై నివేదిక |
| తారీఖు | 30 January 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI,4,BCI |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | [illegible] |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | TRIVENI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |